# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
సంపాదించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక


సంపాదకుడు :

డాక్టరు కే. యన్. కేసరి


# GRIHALAKSHMI


సంపుటము ౨౦]    డిశెంబరు 1951    [సంచిక ౧౨







### చాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# ఈ నెలలో విడుదల!



వాహినీ వారి

# మల్లీశ్వరి

భానుమతి · యన్. టి. రామారావు నటించినది

నిర్మాత-దర్శకుడు: బి. యన్. రెడ్డి

స్టూడియో
వాహినీ

Ⓢ



# విషయసూచిక



## ముఖచిత్రం : కుమారి అభయం

నృత్య భారతి బృందములో ప్రముఖ నర్తకి. మద్రాసునగరం, తమిళప్రాంత్యములలో కథకళి, భరతనాట్యము, మణిపురి నాట్యభంగిమముల ప్రదర్శించి పేరు ప్రఖ్యాతులు సంపాయించినది.

ఈమె మాయవరం వాస్తవ్యులైన శ్రీ యన్. వి. రాజం అయ్యర్, శ్రీమతి రంగనాయకిగారల పుత్రిక. వయస్సు షుమారు 18 సంవత్సరములు. ఈమె నాట్యకళాభివృద్ధికి తల్లి ప్రోత్సాహము చాల ఉపకరించినది.

ఈమె విద్యాభ్యాసము మాయవరం బాలికల ఉన్నత పాఠశాలలో గావించి, నృత్యమును నృత్యకళాకేసరి విఝూరు రామయ్యపిళ్లెగారి దగ్గర నభ్యసించెను.

వయస్సు కొద్ది అయినా, నాట్యచాతుర్య నైపుణ్యములతో ముగ్ధులను చేయగల సామర్థ్యమును గడించినది.

"సిసి"




జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !

---

# స్వవిషయం

మా 'గృహలక్ష్మి'కి యీ సంచికతోటి 20 సంవత్సరములు నిండుతవి. కవులు, రచయితలు తమ అమూల్యమైన రచనలు పంపియు, పాఠకులు తమ ఆదరాభిమానములతో ప్రోత్సహించి యింతకాలము సర్వాలంకార శోభితంగా 'గృహలక్ష్మి' వెలువడ మాతో సహకరించినందుకు కృతజ్ఞులము.

మా 'గృహలక్ష్మి' ఆశయము మహిళా జనోద్ధరణ. రాజకీయ, సాంఘిక, వైజ్ఞానికాభి వృద్ధులకు మహిళకు తోడ్పడటం లక్ష్యము. గడచిన 20 సంవత్సరముల నుండి గృహలక్ష్మి మహిళా ఉద్యమ వ్యాప్తికి, పురోభివృద్ధికి చేసిన సేవ పాఠకులకు తెలిసినదే.

అనేకమంది అభ్యుదయ రచయిత్రులను ప్రోత్సహించింది. ఉత్తమ రచయిత్రులను, చిత్రకారిణులను, గానకళాకోవిదులను ప్రతి ఏటా స్వర్ణకంకణ ప్రదానముతో సన్మానించుచున్నది.

ఇకముందుకూడ ఉత్తమ రచనలతోటి, త్రివర్ణ చిత్రాలతోటి సర్వాంగ సుందరముగా వెలువడి మీ ఆదరాభిమానములకు పాత్రమగునట్లు 'గృహలక్ష్మి'ని భగవంతుడనుగ్రహించుగాక !

—(o)—

# భారత రాజ్యాంగము

శ్రీ చీమలపాటి సూర్యనారాయణగారు

> "భావ ప్రకటనా స్వాతంత్ర్యము మా జన్మహక్కు; రాజ్యాంగము దానిని పూర్తిగా భద్రపర్చేంతవరకు మేము విశ్రమించము."

'భారత రాజ్యాంగ' మంటే యేమిటో కొందరు గృహలక్ష్ములకు దెలియును; తెలియని గృహలక్ష్ములు మన 'రాజ్యాంగము' గురించి తెలుసుకొనుట యెంతైనా మంచిదన్న యుద్దేశ్యముతో దీనిని వ్రాయుటకు సంక్రమిచాను.

మన హిందూ దేశముయొక్క 'రాజ్యాంగ' మొక పెద్దగ్రంథము - ఇందులో - షుమారు 395 సెక్షనులున్నాయ్. మన - 'రాజ్యాంగ రచనా సంఘము' వారు - ప్రపంచములోని వివిధ రాజ్యాంగములను జాగ్రత్తగా పరిశీలించి, తర్జన భర్జనలు గావించి, చివరకు - చిన్న రాజ్యాంగమునకుగూడా దెబ్బతగలకుండా, మనదేశముయొక్క రాజ్యాంగమును అనేక శ్రమ తమాదులకోర్చి, తయారు చేయగలిగారు.

## రాష్ట్రములు, లేక 'యూనియన్'

దీనిప్రకారము - మన దేశముయొక్క పేరును మార్చక, పూర్వపు ప్రకారమే - 'యిండియా, లేక భారత్' అనే నామముతోనే పిలవబడుతుంది.

## రాష్ట్రములు

మన దేశములో యెన్నో రాష్ట్రములున్నాయ్; ఒక్కొక్క రాష్ట్రమున కొక్కొక్క ప్రభుత్వము నేర్పాటు చేయబడుతుంది. యీ రాష్ట్రముల కూటమినే - 'యూనియన్' యంటారు; యీ రాష్ట్రములలో క్రొత్తరాష్ట్రములను చేర్చేందుకొక్క 'కేంద్రప్రభుత్వము' నకే యధికారమంది.

## హిందూ పౌరునకుండే హక్కుల పరిశీలన

1. భారత రాజ్యాంగము అమలులోనికి వచ్చు వేళకు - మనం హిందూదేశములో జన్మించియుండాలి.

2. లేదా - మన ప్రధాన ఆత్మీయులందు ఎవరో వొకరు (తల్లిగాని, తండ్రిగాని) తప్పని సరిగా నివశిస్తూయుండాలి.

3. లేదా-యీ రాజ్యాంగము వచ్చుటకు అయిదు సం||ల పూర్వమునుండీ పై తల్లిదండ్రులలో ఎవరో వొకరు నివశిస్తూయుండాలి.

4. పై నుదహరించిన ఏవిషయములనైనా వొక్కటిగాని యాచరించినట్లయితే - ఆ వ్యక్తికి - 'పౌరసత్వపు' హక్కు కలుగుతుంది.

న్యాయశాస్త్రము-ఏహిందూదేశ పౌరుణ్ణి హెచ్చు తగ్గుల దృష్టితో చూడకూడదు. భావప్రకటనా స్వాతంత్ర్యము మన జన్మహక్కు; తమతమ భావములను స్వేచ్ఛగా ప్రచారము చేసుకోవచ్చు. రాజ్యాంగము దానిని మార్చేందుకు వీలులేదు.

సభలూ - సమావేశములు - సంఘములు నడుపుకోవచ్చు; వీటిని నడిపే సందర్భములో - ఎటువంటి ఆయుధముల నుపయోగించకూడదు.

హిందూ దేశమునకు సంబంధించిన వివిధ ప్రాంతములలో విచ్చలవిడిగా ప్రయాణము చేయవచ్చును; వచ్చిన ప్రాంతములలో స్థిరనివాసములు జేసుకోవచ్చు; తమతమ యాస్తులు తమ ఆధీనములో యుంచుకోవచ్చు; ఇష్టమువచ్చినవారి కమ్ముకోవచ్చును. నచ్చిన వ్యాపారములు చేసుకోవచ్చును.

పదునాలుఁగు, లేదా, పదిహేను సంవత్సరముల యీడుఁగలిగిన పిల్లలచేత ప్రమాద హేతువయిన పనులు చేయించరాదు!

మత స్వీకార విషయములో-ప్రభుత్వ మెటువంటి సౌకర్యము కలుఁగుఁజేసుకొనక, వొకర్ని నిర్బంధిం చేందుకు ప్రయత్నించఁదు. హిందూదేశపౌరుడు-నీతి నియమాలకు, ఆరోగ్య కట్టుబాట్లకు లోఁబడి ఏమతానైనా స్వీకరించవచ్చును.

ఒకరి యాస్తిపాస్తులను - ప్రభుత్వమువారు బలవంతముగా తీసుకొనరాఁదు. గ్రామాఁదులలో-'పంచాయితీ'లను ప్రభుత్వ మేర్పాటుఁగావించి, వాటికి తగిన యధికారములిచ్చి, స్థానిక పరిపాలన లోఁగల సౌకర్యములను ప్రజల కందుఁబాఁటులో వుండేటట్లు ఏర్పాఁటుఁజేస్తుంది.

పందొమ్మిదవ సెక్షను-ఒకటవ క్లాజు ననుసరించి పైనిచేర్కొనఁబడిన-భావప్రకటనా స్వాతంత్ర్యము, ఆయుధములు లేకుండా సమావేశమాట; స్వేచ్ఛగా తిరిగేహక్కును మెప్పుకోలుగురించి యిచ్చినప్పటికీ, అదే సెక్షనులో-పైవాఁటిని వొక సరిహద్దులో యిరికించేందుకు చేసిన నిర్బంధములు న్యాయసమ్మతములు కావు. దేశ ఔన్నత్యాభివృద్ధులను, ప్రజా క్షేమమును కోరే ప్రజాప్రభుత్వము పైనిర్బంధములను వుపసంహరించుకోవాలి.

మరియొక విషయం ఏమిటంటే - న్యాయస్థానములను ధిక్కరించటంగాని-వాక్స్వాతంత్ర్యముందిఁగదాని ఇతరులను దూషించటం; వారిహోదాను, పరువు ప్రతిష్ఠలను కించపర్చకూడఁదు. పైనుదహరించిన వాఁటిలో యేదాచరించిననూ - ఆపౌరుఁడు తన భావప్రకటనా స్వాతంత్ర్యమును కోల్పోతాఁడు.

దీనినిబట్టి - హిందూదేశ పౌరుఁడు యెన్నఁడూ వాక్స్వాతంత్ర్యమును యనుభవించలేఁడు, ఎందుకంటే - ఎప్పుడూ ప్రభుత్వము మన వాక్స్వాతంత్ర్యమును భంగపర్చేందుకు ప్రయత్నిస్తుంది. కాబట్టి- ప్రభుత్వమువారు ఒక సెక్షనులో యిచ్చిన సౌకర్యములను, ప్రక్కనే-కల్పించిన అసౌకర్యములను రద్దు పరచాలి.

మనకు సమావేశ మయ్యేందుకు హక్కు నిచ్చినప్పఁటికీ - ప్రజాశాంతి భద్రతల ననుసరించి, యీ హక్కుమీఁద - "సమంజసమయిన, నిర్బంధము"లను ప్రభుత్వమునకు ప్రవేశపెట్టేందుకు హక్కున్నప్పటికీ - ప్రభుత్వమునకు; "సమంజసము, సహేతుక"మైంది ప్రజకు కాకపోవచ్చు.

కాబట్టి - ప్రజకు పైసౌకర్యములిచ్చి, ప్రక్కనే అసౌకర్యములు కల్పించటం - 'ప్రజాప్రభుత్వ'మనే దాని లక్షణంగాఁదు. నియంత ప్రభుత్వములు చేస్తూన్న పనులు 'ప్రజా ప్రభుత్వము' చేస్తూంటే వీరిలోగల గొప్పతనమేమిటి? యీ పదానికి యున్న విలువేమిఁటి?

ఇటువంటి పనులు జేస్తూంటే - ప్రజ గర్హిస్తుంది. ప్రభుత్వమువారు - ఆశలు చూపించి, అతఃపాతాళమునకు త్రొక్కుతూంటే. సుఖమన్నది లేకపోయిన తరువాత - ఏప్రభువులు గద్దిఎక్కుతేనేం? ఎవరు దిగితేనేం? ప్రజ యిటువంటి వాటితో ఎటువంటి సంబంధమూ పెట్టుకోదు.

మరియొక సెక్షను ప్రకారము (41-వ సెక్షను) ప్రభుత్వంవారు - ప్రజలకు - విద్యలోగల సౌకర్యములు, పనిచేసుకునేహక్కు నిస్తుంది; కల్పిస్తుంది. తదుపరి - అవయవములు లేనివారికి, రోగములతో బాధపడేవారికి, ముసలి వాండ్రకు, ఉద్యోగములు లేక బాపథడేవారికి ప్రభుత్వము తను నిలఁబడే మోకాలుయొక్క సత్తును బట్టి (ఆర్థిక పరిస్థితి) వీలుగావుంటే (మీరు -, యిష్టం కూడా వుంటే అనుకోవచ్చు లెండి) సహాయం చేయడానికి సాహసిస్తుంది. వీటిని తప్పనిసరిగా చేయాలని యెక్కడా లేదు.

నలువది రెండవ సెక్షను ప్రకారము పనిలేని ప్రజకు పనిచూపించేందుకు, స్త్రీలకు వైద్యాలయములు పెట్టడానికి ప్రభుత్వం 'వృత్తి' ని కల్పిస్తుంది. చేయాలనే నిర్బంధం లేదు. తప్పనిసరిగా చేయాలని కాబోలు ప్రభుత్వ మిటువంటి దొంగదారులను పట్టింది. వ్రాయాలంటే యిటువంటి సెక్షనులెన్నో యున్నాయ్ ...

## ప్రెశిడెంటు - చేసేపని

మన హిందూదేశమున కొక 'ప్రశిడెంటు' అనే పేరుతో ఒకవ్యక్తిని 'ఎలెక్టొరల్ కాలేజీ' సభ్యులచే యెన్నుకోఁబడతాఁడు.

### ఇతనికిగల అధికారముల పరిశీలన

1. 'యూనియన్' లో గల శాసనములను అమలు పరిచేందు కితనికి హక్కుగలదు.

2. పైశాసనములను తను స్వయముగా చేయనూ వచ్చు; లేదా - వుద్యోగస్థుల ద్వారా చేయించనూ వచ్చు.

3. పై 'యెలెక్టొరల్ కాలేజీ' పార్లమెంటులో రాష్ట్రమునకు సంబంధించిన సభ్యులు - రెండు సభలకూ సంబంధించిన సభ్యులు వుంటారు. ప్రెశిడెంటు అయిఁదు సం॥ల వరకు తన పదవిని నిర్వహించ వచ్చు. యీ రాజ్యాంగ సూత్రముల యొక్క కట్టుబాట్లకు లోఁబడి, పూర్వపు ప్రెశిడెంటు యీ పదవికి పోటీచేసేందు కధికారముంది.

4. ప్రెశిడెంటుగా పోటీచేయఁదలచే వారికి 35 సంవత్సరములకు తక్కువలేకుండాయుండాలి వయస్సు; ప్రజా ప్రతినిధుల సభకు ప్రాతినిధ్యం వహించుటకు తగిన అర్హత కలిఁగి యుండియూ పౌరుఁడై యుండాలి.

5. ఇతను రాష్ట్ర శాసనసభల యందుఁగాని, పార్లమెంటు నందుఁగాని, వుండకూడఁదు. ఏపరిస్థితిలోనైనా యీ పదవికి వచ్చే సందర్భములో, తత్పూర్వం తను శాసన సభలలో సభ్యుఁడుగా వున్నట్లయితే అది రద్దుపరచబడుతుంది; లేఁదా, ఖాళీ ఔతుంది.

6. 'నాబొంది' అని దీనినే నమ్మకుని యీ ప్రెశిడెంటుండాలిగాని, యేయితర లాభదాయకమయిన వుద్యోగములు చేయరాఁదు.

7. ఏపరిస్థితిలో నయినా ప్రెశిడెంటు తన వుద్యోగమును వీడినా, తీసివేయఁబడినా లేదా తను మరణించినా ఆయేర్పడిన ఖాళీని భర్తీ చేయుట కారు మాసముల ముందుగా ఎన్నికలు జరిపి క్రొత్త ప్రెశిడెంటు నెన్నుకుంటారు. ప్రెశిడెంటనే వ్యక్తి అధికార స్వీకార విషయములో ముందుగా, తను ప్రమాణము చేయాలి. యీ క్రొత్తగా వచ్చిన ప్రెశిడెంటు మాత్రము అయిదు సం॥ల వరకు తన పదవిలో యుండవచ్చు. ప్రెశిడెంటుకు ప్రత్యేక వసతులు యివ్వఁబడుతుంది. పార్లమెంటువారి యనుమతిపై ప్రత్యేక సౌకర్యములు అనుభవించవచ్చు.

8. కొన్ని కొన్ని సందర్భములలో ప్రెశిడెంటుగారు మరణించినా, లేదా జ్వరముతో బాధపడుచున్నా, రాజీనామా యిచ్చినా, లేదా తీసివేయఁబడినా, అటువంటి సమయములలో ఆ పదవిని నిర్వహించేందుకు వొక 'వైస్ ప్రెశిడెంటు' వుంటాఁడు.

9. ఇతను అయిదు సం॥ల వరకు యీ పదవిలో వుండవచ్చు. ప్రెశిడెంటు మల్లే యితనుఁగూడా, అధికార స్వీకార సందర్భములో ప్రమాణము చేయాలి.

### మంత్రివర్గము - వారి కార్యక్రమము

1. ప్రెశిడెంటుకు సలహా యివ్వాలన్నా, సహాయము చేయాలన్నా, యీమంత్రివర్గము చేయును. యీ మంత్రి వర్గమునకు ప్రధాన మంత్రి పెద్దగాను, నాయకుఁడుగా నుండును; యీ మంత్రి వర్గము మాత్రము-'ప్రజాప్రతినిధుల' సభకు సమిష్ఠి బాధ్యత వహింతురు.

2. ఆరుమాసముల కాలములో మంత్రి శాసన సభకు సభ్యుఁడు కాని పక్షమందు - తన పదవిని కోల్పోవును.

### పార్లమెంటు

మన రాష్ట్రముల యూనియన్ కొక పార్లమెంటు వుంటుంది - ఇందులో:—

ఎ. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు

బి. హౌస్ ఆఫ్ రిప్రెజెంటేటివ్స్

అనెడి రెండు సభలుండును. వీటి కధికారి - ప్రెశిడెంటు మాత్రమే;

## 1. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు

ఈ సభలో - ప్రెశిడెంటుచే నియమింపఁబడిన 12 మంది సభ్యులుంటారు. ప్రతీ రాష్ట్రమునుండి 238 సభ్యులకు మించకుండా యెన్నుకోఁబడిన సభ్యులుంటారు. అయితే - ప్రెశిడెంటుచే నామినేటు చేయఁబడిన సభ్యులకు - సాహిత్యములో, కళలలో - విజ్ఞాన శాస్త్రములో మున్నగు వాట్లలో పూర్ణ జ్ఞానము కలిగియుండాలి. పైసభ్యులు 'నిష్పత్తివారీ ప్రాతినిధ్యం' ప్రకారము 'సింగిల్ ట్రాన్స్ఫరబుల్' వోటు హక్కుతోనే ఎన్నుకోఁబడతారు.

## 2. ప్రజా ప్రతినిధుల సభ

రాష్ట్ర ప్రజలచే యెన్నుకోఁబడిన - 500 మంది సభ్యులు యీ సభలో యుంటారు రాష్ట్రాన్ని కొన్ని నియోజక వర్గములుగా విభజిస్తారు. ఒక్కొక్క నియోజక వర్గమున కొక్కొక్క స్థానముంటుంది. నియోజకవర్గ జనాభా అయిదు లక్షలకు 5,00000 తగ్గకుండా, ఏడున్నర లక్షలకు మించకుండా వుంటుంది.

ఎన్నికలముందు - రాష్ట్రములో పెరిగే జనాభా బట్టి నియోజక వర్గాల జనాభాను సరిజేసి, శాసనసభా స్థానముల సంఖ్య పెంచుతూ వచ్చారు. ఏపరిస్థితి యెలా వున్ననూ - 'కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు' సభను రద్దుపరిచేందుకు వీలులేదు. రెండేసి సం||లకు మాత్రము ఆ సభలో వున్న సభ్యుల సంఖ్యలో మూడవ భాగము తిరిగి (రిటైర్) పోవాలి.

### పార్లమెంటు సభ్యులు - వారి అర్హతలు

1. పార్లమెంటులోవుండే ప్రతీ సభ్యుడూ హిందూ దేశమునకు సంబంధించినవాడై యుండాలి. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభా ప్రతినిధికి 30 సం||ల వయస్సుండాలి. ప్రజా ప్రతినిధుల ప్రతినిధికి 25 సం||లకు తగ్గకుండా యుండాలి.

2. పార్లమెంటు సం||నకు రెండు దఫాలు సమావేశపఁడుతుంది; రెండు సమావేశములకు మధ్య నున్న గఁడువు 6 మాసములు మాత్రమే.

3. ప్రెశిడెంటు - పార్లమెంటువారిని అప్పుడప్పుడూ సమావేశపర్చవచ్చు; వాయిదాలు వేయవచ్చును. అవుసరం, ఆవశ్యం అని తోచినపుఁడు ప్రజాప్రతినిధుల సభను రద్దుపర్చవచ్చు.

4. పార్లమెంటులో సభ్యుడుగా పనిచేయకోరే వారు ఇండియా ప్రభుత్వములోను - రాష్ట్ర ప్రభుత్వములోను వుద్యోగం చేసేవ్యక్తి కాకూడదు.

5. న్యాయస్థానమువారు-ఒకనిని పిచ్చివానిగా ప్రకటించినా, తాను స్వాభావికంగాను మతిలేనివాడైనను, దివాలా తీసిన వ్యక్తిగాని, ఇండియాదేశ పౌరుఁడు గాకపోయిననూ, శాసనసభా సభ్యుడు అయేందుకు వీలులేదు.

### శాసనములు నిర్మించుట

1. రెండు సభలవారి యామోదముపై ఒక్క 'మనీబిల్లు'తప్ప మిగతావి శాసనంగా మారుతాయ్. ఒక బిల్లును ఒక సభవారంగీకరించనపుడు యిందులో వుండే సరుబాట్ల విషయములో - ఒక నిశ్చయానికి రానపుఁడు, బిల్లు 6 మాసములపైఁబడి చర్చించఁబడకుండా యున్నయెడల - రెండు సభల వారిని సమావేశపరచుటకు ప్రెశిడెంటు సమన్ చేయవచ్చును.

2. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో మనీబిల్లు ప్రవేశపెట్టకూడదు. ప్రజాప్రతినిధుల సభవారు మనీ బిల్లు నామోదించి, రెండవ సభకు పంపఁబడుతుంది. రెండవ సభవారు 15 రోజుల తరువాత ఏమయినా సిఫార్సులున్నయెడల, తిరిగి ప్రజాప్రతినిధుల సభకు పంపబడాలి.

3. పైశిఫార్సులను ప్రజాప్రతినిధుల సభవారామోదించకపోతే - సవరణలు లేకుండానే రెండు సభలువారి ఆమోదంపై ప్యాసు కాఁబడుతుంది.

### న్యాయశాఖ

ఇండియాకొక ఉన్నత న్యాయస్థానముంటుంది. ఇందులో - ఒక ప్రధాన న్యాయమూర్తి - ఏడ్గురు యితర న్యాయమూర్తులుంటారు. న్యాయమూర్తులు 65 సం||ల వరకు యుద్యోగములో నుండవచ్చు. ఉన్నత న్యాయస్థానములో న్యాయమూర్తిగా పని

చేయడానికి - మొదట హిందూదేశపౌరుడై యుండాలి; లేదా హైకోర్టులో 5 సం॥లు న్యాయమూర్తిగా పనిచేసినవాఁడై యుండాలి; లేదా - పదిసంవత్సరములయినా 'ప్లీడరు'గా హైకోర్టులో పనిచేసిన వాఁడైనా యుండాలి.

రెండు సభలలోని ఎక్కువ సభ్యుల ఆమోదముపై న్యాయమూర్తిని తొలగించవచ్చు. న్యాయమూర్తులు వుద్యోగములో ప్రవేశమునకు ముందుగా, ప్రెశిడెంటు ముందర ప్రమాణము చేయాలి. వీరి యొక్క జీతాలు పార్లమెంటువారే నిర్ణయిస్తారు.

## గవర్నరు అధికారముల పరిశీలన

ప్రెశిడెంటే - ప్రతీ రాష్ట్రమునకు గవర్నర్ను నియమిస్తాఁడు. ఇతను 5 సం॥ల వరకు వుద్యోగము చేయవచ్చును. ఇతనీ పదవినుండి విరమించుకునే పక్షములో - లిఖిత పూర్వకముగా ప్రెశిడెంటుకు తెలియపరచి మానివేయవచ్చును. ఇతను వయస్సు 35 సం॥లకు తగ్గకుండా యుండాలి; హిఁదూదేశ పౌరుఁడై యుండాలి. ఇతనీపదవికి వచ్చేటప్పుడు తత్పూర్వం ఏవుద్యోగం చేస్తున్నా, అది రద్దు కాఁబఁడుతుంది. పార్లమెంటువారే - వీరికితగిన సౌకర్యములు, జీతాలు కల్పిస్తుంది. గవర్నరుగారు వుద్యోగములో ప్రవేశించే ముందర ప్రమాణము చేయాలి. నెరస్తులయొక్క నేరములను రద్దుపరిచే యధికారమితనికిఁగలఁదు.

గవర్నరుగారికి సలహాలిచ్చేందుకో మంత్రివర్గముంటుంది. యీ మంత్రివర్గమునకు పెద్ద ప్రధాన మంత్రి! మంత్రులు దేనిమీద సలహాలనిచ్చిందీ న్యాయస్థానములో విచారణ జరపకూడఁదు. ప్రధాన మంత్రిని నియమించేది గవర్నరు మాత్రమే. మంత్రులు తమతమ వుద్యోగములలో ప్రవేశించే ముందర గవర్నరుగారిదగ్గర ప్రమాణం చేయాలి. మంత్రుల జీతాలు - శాసన సభవారే నిర్ణయిస్తారు.

మద్రాసు - బొంబాయి - బీహారు - పంజాబు - బెంగాలు - సంయుక్త రాష్ట్రములలో - 'లెజిస్లేటివ్ అసెంబ్లీ' (ప్రజాప్రతినిధులసభ) 'లెజిస్లేటివ్ కౌన్సిల్' అనేటి రెండు సభలుంటాయి. మిగతా రాష్ట్రములలో ఒకటేసభ వుంటుంది. అసెంబ్లీలో 500 మంది ప్రతినిధులుంటారు. వీళ్ళని ప్రజలే యెన్నుకోవాలి!

## లెజిస్లేటివ్ కౌన్సిల్

అసెంబ్లీలోవుండే ప్రతినిధుల సంఖ్యలో నాల్గవ వంతుమంది యిందులో వుంటారు; నలుబదిమంది సభ్యులకు తక్కువ వుండకూడదు. మొత్తపు సంఖ్యలో 12.వ వంతు ప్రతినిధులను పట్టభద్రుల నియోజక వర్గమునుండి ఎన్నుకోవాలి. వీరు మన రాష్ట్రములోనే నివశిస్తూ యుండాలి; వీరు పట్టాలను పుచ్చుకున్న ఆరెనిమిది సం॥లకు కౌన్సిలుకు పోటీచేయడాన్కి హక్కుంటుంది.

తదుపరి - వుపధ్యాయ నియోజక వర్గమునుండి మొత్తపు సంఖ్యలో 12.వంతు ప్రతినిధుల్ని యెన్నుకోవాలి. యీవృత్తిలో వీరికి షుమారు మూడు సంవత్సరముల అనుభవముంటే చాలును. యూనియనులో హిందీభాష అమలులో నుంటుంది; 15 సంవత్సరములవరకు ఇంగ్లీషు అమలులో నుంటుంది.

———(:o:)———

# కవిసన్మానము

విశాఖపట్టణ విదుషీమణుల పక్షమున సువర్ణ ఘంటా కంకణ మొకదానిని శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారికి బహూకరించి సన్మానింప నిశ్చయింప బడినది.

శ్రీమతి రుక్మిణమ్మగారు కవి, రచయిత్రిగా పదిహేను సంవత్సరములనుండి పేరు ప్రఖ్యాతులు గడించిరి. ఈమధ్యనే "దేవీభాగవతమును" చక్కని సరళ శైలిలో వ్రాసి పండిత పామరుల మన్ననల నందుకొన్నారు.

ఈకంకణ బహూకరణోత్సవము 1952 జనవరిలో జరుగనున్నదని తెలుపుట కెంతయు సంతసించుచున్నాము.

'సి సి'

# కేసరి విద్యాసంస్థల సహాయార్థం

## నాటక ప్రదర్శనము

---

కేసరి విద్యాలయముల భవన నిర్మాణ నిమిత్తమై నిధి సేకరణకుగాను మద్రాసు సెక్రెటేరియట్ ఆంధ్ర సంఘమువారు 'రాణాప్రతాప్' నాటకమును నవంబరు నెల **24-**వ తేదిన రసికరంజనిసభ హాలులో ప్రదర్శించిన సందర్భమున మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తులు శ్రీ పి. వి. రాజమన్నారుగారు అధ్యక్షత వహించిరి.

మద్రాసు హైకోర్టు న్యాయమూర్తులగు శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు, శ్రీ రాజమన్నారు, మద్రాసు ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజా శ్రీ కేసరిగార్లకు యితర ప్రేక్షకులకు స్వాగతము చెప్పుచు కేసరి విద్యాలయముల గతఏడు సంవత్సరముల చరిత్రను క్లుప్తముగా వివరించుచు ప్రస్తుతపు కేసరి హైస్కూలు 7 సంవత్సరములకు ముందు తెలుగు బాలబాలికల విద్యా సౌకర్యముకొరకు నగరములోని పాఠశాలలలో తెలుగు తరగతులను మూసివేస్తున్న సమయమున కొందరు ఆంధ్ర ప్రముఖులు కమిటిగా నేర్పడి మైలాపూరు ప్రాంత్యమున ప్రాథమిక పాఠశాలను స్థాపించిరనియు, కొంత కాలము దాని నిర్వహణకు అష్టకష్టములు పడవలసి వచ్చినదనియు చెప్పిరి.

దరిమలా భగవంతుడులాగ శ్రీ కేసరిగారు దాని నిర్వహణకు పూనుకొనినపిదప కేసరి విద్యాలయముగా మార్చబడినది. అచిరకాలంలోనే మిడిల్ స్కూలయి హైస్కూలయినది. శ్రీ కేసరిగారు విద్యాలయమునకు భవనాన్ని, భూరివిరాళాన్ని సమకూర్చి దానితోబాటు త్యాగరాయనగరులో తెలుగు బాలబాలికల విద్యా సౌకర్యముకొరకు కేసరి ప్రాథమిక పాఠశాలను స్థాపించి నిర్వహణకు పూనుకొనిరి.

ఈ విద్యాలయముల నిర్వహణా పటిష్టత నుద్దేశించి కేసరి ఎడ్యుకేషనల్ సొసైటిని రిజిస్టరు చేయించి నిర్వహణా బాధ్యతను దాని కొప్పగించిరి.

కేసరి ప్రాథమిక పాఠశాల భవన నిర్మాణమునకు మద్రాసు ప్రభుత్వమువారు షుమారు రెండు యకరముల భూమిని మంజూరుచేసిరి. కమిటి కార్యదర్శిగారైన దివాన్ బహదూరు బండి శ్రీ హరిరావునాయుడు, శ్రీ పతి రామమూర్తి, మైదవోలు శేషాచల పతిగార్ల కృషి ఫలితంగా భవన నిర్మాణ నిధికిగాను షుమారు రు 30000 లు. సేకరించ బడినది. బహుకొద్దికాలంలో భవన నిర్మాణం పూర్తి అయింది. ఈ సందర్భమున శ్రీ హరిరావు నాయుడుగారి కార్యదీక్ష, ఉత్సాహము ప్రత్యేకముగా కొనియాడతగినవి.

కేసరి విద్యాలయముల స్థాపనకు, అభివృద్ధికి చేసిన దానములు, సహాయము నగరములోని తెలుగువారు జన్మజన్మములకు స్మరించవలసినవి.

ఈ ప్రదర్శింపబడిన నాటకమునకు షుమారు రు 12000-లు. వసూలయిన దనియు, తమతో సహకరించి నాటకము విజయముగునట్లు తోడ్పడిన వారికి కృతజ్ఞతను తెలిపిరి.

శ్రీ రాజమన్నారుగారిని గురించి చెప్పుచు వారు న్యాయశాస్త్ర ప్రవీణతయందు సాటిలేని వారనియు, నాటక రచయిత, నటుడేకాక గాన, నృత్య, చిత్రలేఖనము లంద పారమగు అభిరుచి, అనుభవములు కలవారనియు, వారు అజాత శత్రువనియు, ఇతరత్రా పనులున్నప్పటికి తమ ఆహ్వానము నంగీకరించి అగ్రాసనాధిపత్యము వహింపవచ్చి నందుకు తమ కృతజ్ఞతను తెలిపిరి.

శ్రీ రాజమన్నారుగారు తన అధ్యక్షోపన్యాసములో శ్రీ సత్యనారాయణరావు గారికి తన పైనున్న ప్రేమవలన చెప్పినంతటి ఆధిక్యత తనలో లేదన్నారు.

కేసరిగారి దాతృత్వమును పొగడుచు మద్రాసు తమిళులదా, ఆంధ్రులదా అనే సమస్య ఎట్లున్నను తెలుగువారు చైనా, జపాను వారిలాగ అయిదు, పదిమందికాక లక్షల సంఖ్యలోనే మద్రాసులో నివసిస్తున్నారన్నారు.

వారి బిడ్డలకు విద్యా సౌకర్యములు సమకూర్చని లోటుకు ప్రభుత్వము కొంత బాధ్యత వహించక తప్పదు. మిగిలిన కొంతలోటును తీర్చుకొను బాధ్యత వహించ వలసినవారు ప్రజలు. వారికి తన దాతృత్వము మూలంగా శ్రీ కేసరిగారు మార్గదర్శకు లయినారన్నారు.

కార్యదర్శిగారి కార్యదీక్ష, ఓర్పు, ఉత్సాహముల ప్రశంసించుచు వారు తలచు కొన్నచో ఏపాటి కార్యభారమునైన సులభముగా నిర్వహించగలరనియు, వారి కృషి ఫలితంగా విద్యాలయములు సర్వతో ముఖాభివృద్ధి నందగలవని, తనకు జరిపిన సన్మాను నకు కృతజ్ఞతను తెలిపిరి.

నాటకములో శ్రీ జి. వీరరాజు, శ్రీమతి. ఎ. కమలాదేవిగారలు శక్తిసింహ, మోహ రున్నిసాపాత్రలను చక్కగా నిర్వహించారు.

సెక్రెటేరియట్ ఆంధ్ర సంఘాధ్యక్షుడు శ్రీ వి. హనుమంతరావుగారు ఈ రూపంగా ఆంధ్రులకు సేవచేసే అవకాశం కలిగించినందుకు కేసరి విద్యాసంస్థల నిర్వాహకులకు కృతజ్ఞత తెలుపడంతో నాటకము సమాప్తమాయెను.

సి. సి. పున్నయ్య



# విరాటపర్వంలో 'ద్రౌపది'

శ్రీ బూదూరు రామానుజులురెడ్డి

కలంతీసి కమ్మని కవిత్వం వ్రాయటం కళ, కావ్యానికి అలంకారాలు కూర్చటం అందం, దానికి ధ్వని ప్రధానంగా చేయటంశక్తి. జీవమిచ్చి పోషించటం శిల్పత్వం. పొల్లులేకుండా, సహజత్వం మీరిపోకుండా పాత్రలను సృష్టించి పోషించి రక్తికట్టించడం అందరికీ కానిపని.

వాల్మీకి వ్యాసాదులు మహాకావ్యాలు వ్రాసిపోయిరి. ఆదికవి నన్నయ ఆదేధోరణినే అందుకొన్నాడు. అతని అడుగు జాడలంటిన తిక్కన అమోఘంగా అద్వితీయంగా ప్రతిభావ్యుత్పత్తులతో కవితకు వ్యక్తిత్వంకలిగించి కవిబ్రహ్మఅయినాడు. అతనికలం గీచిన బొమ్మలు చిత్రకారుని కుంచెకు అనుకూలించిరావు. ఆ జీవకళలను అచ్చొత్తించ గలిగిన రంగులులేవు. తిక్కన సృష్టి తిక్కనదే. కవితాశిల్పం అసల్పంగా ప్రకటించిన అతని విరాటపర్వంలోని ద్రౌపది, ద్రౌపదిమాత్రమేగాదు. ఆమె ఆదర్శయువతి. స్త్రీశక్తిని, స్త్రీ స్వభావాన్ని, స్త్రీలోని ప్రతి అణువును కూలంకషంగా నిర్వక్రమంగా నిరూపించి చూపిస్తుంది.

ఆమె అబల - ముద్దరాలు - పనిపాటలెఱుంగని గరువంపుపడుచు. అలంకరించుకోవడానికైనా ఓపికలేని అమాయిక. ఒంటిపాటు సహింపదు. అడుగుపెట్టితే ఆమె పద పద్మాలు కందిపోతవి. అందుకనే కాబోలు అర్జునుడు ఆపుష్పకోమలిని మోసితెస్తున్నా ఆమె అడ్డుచెప్పకపోవటం.

ఆత్మగౌరవం ఆమెలోని ప్రత్యేకత. రాణివాసం నశించినా, అడవిదారులు పట్టినా ఆమెలోని యీ శక్తి నశించిపోలేదు. విరటుని రాజవీధిలో బహురూపిణిగా నడచిపోతుంది. రాణి సగౌరవంగా చెలికత్తెలచే రమ్మని పుత్తెంచినకాని అంతఃపుర సౌధమునందడుగిడలేదు. బిచ్చమెత్తటానికి వచ్చినప్పుడుకూడా బిగువువీగలేదు. ఈ భయంచేతనే కొలువు ప్రవేసించడానికి ముందే,

> "నీచములయ్యెడు పనులకు" నాచాలమి యెఱిగి మన్ననకు బాత్రముగా
> నీ చిత్తంబున గైకొని, యాచారము దప్పకుండ నరయుమునన్నున్."

అని హెచ్చరించింది. కలపములు కూర్చటం, తిలకాలు దిద్దటం, ముద్దు పూల మాలలు కట్టటం ఈలాటి సునాయాసములైన పనులకే ఆమె తాళిరది కనుక కోరింది.

ఆత్మగౌరవం అంతరించి పాణ్యేపట్ల దైవతుల్యుడైన భర్తనుకూడా సరకు గొనటంలేదామె. వారందరూ విరటుని కొలువు అందుకోవటానికి పూర్వం ధర్మజుడు, అక్కడి దుర్జనులగు తులువల తలపులను కనిపెట్టి జాగ్రత్తగ వర్తించుకోమని ద్రౌపదికి వ్యంగ్యంగా సలహా నివ్వబోతుంటే, ఆమె అనాదర మందస్మిత సుందర వదనారవిందయై అతనికి

"ఆరయ నెంచను గౌరవ, భారం బెడలంగనీక పాతివ్రత్యా
చారము మై వర్తింతురు, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్."

అని తింగురంగుగా బదులిచ్చింది,

ఆమె మానినీమ. పతివ్రత. సౌజన్యధన్య. అతిదూరదర్శి. కీచకుని చూచినంతనే తల్లడిల్లపోయింది. అతని రెప్పపాటు ఆమెపయి సోక సోకకముందే అతని దుష్టాత్మను "ఎక్సరే" లాగు కనిపెట్టింది. దూరంగా తొలగివుండటమే శ్రేయస్సు అనుకొన్నది. కానీ ప్రౌఢకనుక తన మనోభావాల్ని గుప్తపరచ గలిగినంతవఱకు గుప్తపరిచింది. స్థాయితప్పింది. సుధేష్ణ తన్ను చేతులారా ఆ కీచకాధముని యింటినుండి కల్లు తేబంచింది. కానిమ్మని కలశంతో కదిలింది. ఆత్మవిశ్వాసంకల అబల కదామరి. అనుకున్నంతా అయిపోయింది, కీచకుడు వెన్నంటినాడు. లేడిపిల్లలాగున పరువెత్తింది. తప్పించుకోవటానికి విశ్వ ప్రయత్నాలు చేసింది. ఆపివుచ్చటాని కన్నినీతులుగరపింది.

ఇంక ద్రౌపది అబల కాదు. ఆవేశపూరిత. అభిమానసంపన్న. ఆమె జీవకణాలన్నీ గిఱ్ఱుమని ఎదురుతిరిగినవి. ఆమె కోపాగ్ని రవులుకొనింది. మానసంరక్షణం ప్రాణానికన్నా యెక్కువగా తోచిందప్పుడు. విశ్వాసాన్ని పూర్తిగా మఱచి పోయింది. విరటుని సభాంగణంజొచ్చింది. పంబిన కోపంతో ప్రళయ తాండవం చేసింది. సింహ గర్జనం మొదలుపెట్టింది. సభకంపించి పోయింది. ధర్మరాజున్నంతఓర్పు తనకు లేదని చాటించింది. అంతటి సభముందర జంకు గొంకులేక, అదరు బెదురుగా సగర్వంగా, సార్థకంగా,

ఇందఱు జూడగా నిచట నిమ్మెయి నన్ను బతివ్రతాగుణా
స్పందిత వర్తనం బరమసాధ్వి ననిందితశీల గీచకుం
డెందును సెట్టి యంగనల నెవ్వరు జేయని యట్లు సేయగా
గొందఱకైన నిష్ఠు కృపగుందటె గాదటె యేమి సెప్పుదున్

అనిఘోషించింది. "చతురులు నా నెందు నుతికినెక్కియున్న గంధర్వులేపురు నన్నునిట్లు లోకదువఱుపంగ నూరకయునికి సూడ నచ్చెరువుగాదె యెవ్వరియాండ్రఁరింక బరిభవంబున బొందక బ్రదుకువారు" అని గాఢంగా మగలకెల్ల మసిబూసింది.

పరాభవాగ్ని ప్రజ్వలించింది. ప్రతీకారం ఆమెకు పరమార్థమై పోయింది. తెలివితేటలు పని చేయటానికి మొదలు పెట్టినవి. చూపిందితన చిత్రాంగితనం. సులభంగా తనకు వశమయ్యేది పశుబలమేనని నిశ్చయించింది. ఆరాత్రికి రాత్రే ధౌతపరిధాన పరీతయై మహానసగృహము ప్రవేశించింది. భీముణ్ణి తట్టిలేపి పట్టింది. ఏడ్చింది. ఎత్తిపొడిచింది. భీముని ప్రతిరక్తనాళాన్ని యెగమీటింది. సగంరాత్రిలో నిశా పైశాచంవలె మెరసిపోయింది.

కీచకుడిక మృత్పిండమయ్యాడు. ఆశుభవార్తవిన్న ద్రౌపది చెంగున దూకింది.

"ఇదిగడు మద్దరాలు పనులేమియు జేయగ నేర దెంతయున్
మృదువొక కీడు పాటునకు మేకొనజాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కోర్వదొకటిం దనుదాసవరించు చొప్పెఱుం
గదు తగనొండులం గొలువగా వెరవెమ్మెయి గల్గునక్కటా"

అని ధర్మజుడు వర్ణించిన ద్రౌపది కనపడదిక్కడ. ఉరులొడ్డెడు నెరజాణయై వీరనారియై విలసిల్లింది.

"దప్పిజనించె ప్రేళుల పుటంబులు పొక్కె దొడంగె గోళ్లలో
జిప్పిలజొచ్చె నెత్తురులు చిత్తము నాకు గడుఁ వశంబుగా
దప్పర మిచ్చుటచ్చటను నాసలవచ్చితి నెంత దవ్వొకో
యిప్పటిభంగి నొక్కడును నేగెదు దానికి నోర్వనెమ్మెయిన్"

అని కన్నీటికడవలు క్రుమ్మరించిన ద్రౌపది విస్ఫులింగాలు వెదజల్లుతుంది. ఆ నిశీమధ్యంలో, ఆ చీకటిగదిలో ఆ అసహ్య మృతకళేబరాన్ని శంక లేకుండా తనివితీరచూచి తన్ని తలయూచి ముక్కుపై వ్రేలిడి తృప్తి చెందింది. ఆ స్త్రీ శక్తి యెక్కడకనిపించినా యేదోవుద్రేకం కలిగిస్తూవుంటుంది.

ఇది అఖిలాంధ్ర జనాళిమోదమును బొరయ ఆంధ్రకవితా మహనీయస్థితిమూలమై ప్రపంచమహాకవుల్లో అభ్యర్హిత స్థానం ఆక్రమింపకలిగిన మన తిక్కన కవితా సృష్టి అని అంటాను. మీరు ఏమంటారు?

# "సుఖమెరుగని జీవితాలు"

శ్రీమతి సత్యవాడ లక్ష్మీదేవి

ఉద్యాన వనములో ఒక చిన్న పెంకుటిల్లు వుంది. ఆ యింటికి సమీపాన్నే ఒక చిన్న కోనేటి కాలువ పారుతోంది. ఆయేటి కాలువ ఒడ్డున అనేక పూలచెట్లు పొదలు మొలచి మరింత దానికి సొగసు కల్పిస్తోంది. దాంట్లో నీరు పారుచున్నప్పుడు దూరమునుండి చూచువారికి ఒక పెద్ద వెండికడ్డీ పెట్టినట్లు ప్రశాంతముగానుంది. సమీపాన చెట్లపైనున్న విహంగముల కలకల నాదములవలన మరింత శోభాయమానముగానుంది. ఇంటిముందు చెట్ల పనసలు వరుసలుగా, చిత్రచిత్రముగానున్నాయి. ఇంటిముందు రెండు విశాలమైన తిన్నెలున్నాయి. ఈ యింటిని చూచి ప్రతివారికి నిజముగ అక్కడ సౌఖ్యమనుభవింప బుద్ధిపుట్టక మానదు. నిజంగా ఈ ఇల్లు చూస్తుంటే భూలోక స్వర్గమా, అనిపిస్తుంది.

ఇట్టి కుటీరములో శశికళ, మనోహర్, నివశిస్తున్నారు.

మనోహర్ శశిని ప్రేమించునట్లు మరి ఏ పురుషుడు కూడా స్త్రీని ప్రేమించడని ఎంతో గర్వము శశికి. తక్కిన అందరు స్త్రీలూ "ఎన్ని నోములు నోచావోనమ్మా! ఎంత అదృష్టం!!" అంటూంటే శశి ఆనందడోలికలలో ఉయ్యాలలూగేది. మంచి ఉద్యోగం, కావలసినంత ఆస్తి! అన్నింటిని మించిన మగని ప్రేమ. శశి జీవితంలా ఏ స్త్రీది యుంది?

శశి చక్కని చుక్క. అందాలరాసి. కమలరేకుల వంటి నేత్రాలు. మంచి తలకట్టు, మనిషి చామనచ్ఛాయ. పెసరకాయలవంటి పెదవులు, విశాలమైన నుదురుగలది. మనోహర్ శశి మొగుడనటానికి ఎంత మాత్రము తీసిపోడు! అందమైన హైరోడ్డు క్రాఫింగు, పసిమిరంగూ, విశాలమైన నేత్రాలు, వీటికి తోడు భుష్‌కోటు ధరిస్తాడు. ఇంక వేరే వర్ణించాలా? అంత అందమైన వాళ్ల నిద్దర్నీ కూర్చినందుకు ఆదేవుణ్ణి మెచ్చుకోనివారెవరు?

ఎవరైనా ఇద్దరు దంపతులు అందమైన వాళ్ళవవచ్చు. కానీ వాళ్ళ హృదయాలు కలియడం కష్టం. శశీ మనోహర్‌ల, శరీరాలు వేరుకానీ ఆత్మలొకటే! నిత్యం ఆ పుణ్య దంపతు లిరువురు షికార్లే.

◆ ◆ ◆

ఆవేళ పూర్ణమి. మేఘచంద్రుడు వర్షంకురిపిస్తున్నాడు. 'శశీ, ఇవాళ నాతో బీచికి రావాలి' అన్నాడు. మనోహర్. ఏడయ్యేటప్పటికల్లా శశి అపర రంభలా అలంకరించుకుంది. మంచి బెంగాలీ ఫేషన్ చీరకట్టి జార్జట్ జాకెట్ తొడిగి నెక్లేస్ పెట్టుకుని త్రాచుపాములాంటి జడకు నల్లని రిబ్బను పెట్టుకొని చంద్రకళా తయారవుతుంది ఆసుందరి. ఇక మనోహర్!

తెల్లని పొడుగు లాల్చీ కట్టుకొని, గళ్ళ గళ్ళ పేంట్ తొడుక్కొని, అందంగా క్రాఫ్ దువ్వుకొని చంద్రుడులా తయారవుతాడా సుందరుడు.

చక చకమని బీచివైపు చేతులు కలుపుకొని నడిచిందా జోడి. ఇసుకలో కూర్చున్నారు, నత్తగుల్లలను చూస్తూ. చంద్రుడు ఎంతబాగున్నాడో!

◆ ◆ ◆

"ఏమండీ దూరంగా పడవలో ఆ నావికుణ్ణి చూశారా? ఎంత హాయిగా వెడుతున్నాడో! ... ఒక్కటడుగుతాను, తీరుస్తారా?"

"నీకు తీర్చనిదేముంది, చెప్పు శశీ?"

"అదుగో, చూశారా? ఆపడవ ఎక్కుదామా?"

"శశీ, ఈవేళ పౌర్ణమి, కెరటాలెలా ఎగిరి పడుతున్నాయో చూశావా? చాలా ప్రమాదం సుమా!"

"ఆ, మరేం భయంలేదు. చాలా సరదాగా ఉందండీ?

ఈ పౌర్ణమిలో ... ఇలాంటప్పుడే, రతీ మన్మథుల్లా, ఆ అలలపైన స్వర్గంలోకి తేలిపోవాలిగానీ ... అయినా ఆ పల్లెవానికి లేనిభయం ... మనకెందుకని? పదండీ?"

తన ప్రియురాలు, తన ప్రాణం; తన స్వర్గం, తన చిన్న శశియొక్క కోర్కె తీర్చలేకుండా వుండలేక పోయాడు మనోహర్.

ఇద్దరూ, తారా చంద్రుల్లా ఠీవిగా పడవెక్కి కూర్చున్నారు. పల్లెవాడు నడుపుతున్నాడు.

శశి కోమలంగా "కన్నుల కింపవు వెన్నెల రేయి" అనేపాట నారంభించింది. ఆ స్వర్గీయ సుఖంలో ... అలా అరమైలు దాకా వెళ్లి పోయిందా బోటు. అప్పుడు తెలివి వచ్చిందా ప్రియునకు.

"అమ్మయ్యో, పడవ ఎలా ఊగిపోతోందో!"

"శశీ! ఎంతదూరం వచ్చేశామో! ఏమోయి బోటును వెనక్కి నడుపు! ..."

పావుమైలు వెనక్కి అతిప్రయాసతో పడవను లాక్కొచ్చాడు పల్లెవాడు.

ఇకలాభం లేకపోయింది. రాత్రితోపాటు కెరటాలు ఎక్కువై పోయాయి.

శశి కంగారు పడింది.

"అమ్మయ్యో! ..."

మనోహర్‌కు ఈత చాలాబాగా వచ్చు.

అనుకోకుండా శశి మాటేనా ఆలోచించకుండా గభాలుమని నీటిలో కుంకేశాడు మనోహర్.

శశి సున్నిత మనస్సు గుభిల్లుమంది.

మనస్సుతోపాటు, పడవ కూడా గిర గిరమని తిరిగి పోతోంది ... పల్లెవాడు, తనూ, పడవలో సగం నీళ్లలో మునిగిపోయారు.

పెద్ద అలవచ్చి ఆ నావికా శశిలను కొట్టేసింది.

♦ ♦ ♦

తడిసిన షరాయితో ఉక్కిరి బిక్కిరియై వడ్డున చేరాడు మనోహర్.

అంతదాకా ఆవాతావరణంలో, ఆభయంకర తరంగాలలో అతనికి శశిమాటే జ్ఞాపకం లేదు.

శశిని వదిలేసి ఇలా వచ్చేయడం ఏమైనా బాగుందా? తన శశిలేకుండా ఏమొహం పెట్టుకుని ఆమెమాట మరచిపోయి బయట పడ్డాడు, తనుఽ ఒక్కటే సమాధానం చెప్పతోంది మనస్సు. "ఆత్మ సంరక్షణ మప్పుడు ఆత్మబంధువులైనా జ్ఞాపకం రారు. నీతప్పలేదు."

ఎందుకొచ్చిన ఆత్మ సంరక్షణ! తన శశిని రక్షించకుండా ఎందుకువచ్చిన ఈత! శశిరక్షణ కంటే ఆత్మ రక్షణ ఎక్కువా? శశి త్యాగం కన్న ఆత్మ త్యాగము మేలు. పాపం, యీపాటికి ఆ, అభాగిని ఏతరంగ హస్తంలో ఉందో!

మనోహర్ కన్నీళ్ల నాపుకోలేకపోయాడు. ఛీ, వెధవబ్రతుకు ఏదౌర్భాగ్య సముద్రాన్ని జయించి, భేదించుకుని బయటకు వచ్చాడో ఆసముద్రంలోకే వెళ్లిపోతున్నాడు మనోహర్.

♦ ♦ ♦

అతిప్రయాసపడి నావికుడు శశిని బయటికి తీసుకొనివచ్చి వడ్డున పరుండబెట్టేడు. కొంచెం విసరి "అమ్మగారూ" అని పిల్చాడు. కొంతసేపటికి స్మృతి తప్పిన శశి మెల్లిగా కదిలింది.

పల్లెవాని సంతోషానికి అంతులేదు.

శశి తన నేత్రాలొక్కసారి విప్పిచూసింది. ఆ వెన్నెలలో, ఈ విప్పారిన చంద్రికలో ఎవరో గబగబ సముద్రంలోకి వెళ్లిపోతున్నారు. మనోహర్ కాదుకదా.

తన శక్తినంతను ఉపయోగించి గట్టిగా "మనోహర్" అని అరచింది శశి!

పల్లెవాడు "బాబుగారు" అని పెద్దకేకలు పెట్టేడు. వారిద్దరి కృషి ఫలించింది.

మనోహర్ నమ్మలేకపోయాడు. తన శశి ... తను వదిలేసిన శశా ?? నీటిలోనుంచి పైకివచ్చేశాడు. అరఫర్లాంగు దూరంలో పడుకొని యున్న శశిని పోలికపట్టేడు మనోహర్.

"శశీ!... ఒక్క పరుగు పెట్టేడు.

తరువాత ఇద్దరు ఇంటికి వెళ్ళేరు.

♦ ♦

ఇంటికి సుళువుగా చేరిందన్న మాటేగానీ శశి మనసు, మనసులో లేదు. "తన్ను వదిలేసి స్వార్ధపరుడై ప్రాణప్రదమనుకున్న భర్త స్వప్రాణములు రక్షించుకున్నాడు. "మగవారెంతకైన సమర్ధులు" తన్నా నావికుడు రక్షించకపోతే? ...

మనోహర్ అప్పుడే క్షమాపణ వేడుకున్నాడు. "శశీ అవళ్ళు తెలియని పరిస్థితిలో నాప్రాణాలు రక్షించుకున్నాను ... నన్ను ... క్షమించవూ? ...

శశి మాట్లాడలేదు.

క్షమాపణ! తనను వదిలేసి స్వార్ధపరుడైన తన మగనికా క్షమాపణ!

♦ ♦ ♦

శశికి మగనిమీద పూర్వపు ప్రేమలేదు. ఎప్పుడూ చిసుర్లూ, బుసుర్లూ!

మనోహర్ మాత్రం శశిని నిర్మలంగా ప్రేమిస్తున్నాడు. రోజులు దొర్లిపోతున్నాయి. సంవత్సరాలు గడిచిపోతున్నాయి. ఇప్పుడు శశికి చక్కని పూర్ణ చంద్రుడివంటి కొడుకు.

♦ ♦ ♦

ఆవేళ పౌర్ణమి. రాత్రిసమయం. శశి మనోహర్‌లు విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఆవేళ పశువుల కాపరి పాకలో దాలి పొయ్యి మీద వులవలు ఉడకబెట్టి చిన్న నిద్రతీశాడు. దాలి పొయ్యి ఆర్పడం మరచి పోయాడు. పొయ్యిలో నుండి చిన్న నిప్పురవ్వ యెగిరి పాక అంటుకుంది. పశువులకాపరిలేచి పరుగెత్తుకుంటూ వీధిలోకి వెళి పోయినాడు.

శశి మంచి గాఢనిద్రలోనుంది. ఒక్క నిప్పురవ్వ పడగానే లేచింది. చుట్టూ మంటలు, పొగ; ఆమెకేంచెయ్యడానికీ తోచలేదు.

పిల్లాణ్ణి తీసుకుని అప్రయత్నంగా క్రిందకి పరుగులెట్టింది. ఆమెకా గొడవలో మగని సంగతే జ్ఞాపకం లేదు. మనోహర్ ఏమయ్యాడో యేమో! ...

పిల్లాణ్ణి తీసుకుని ఇవలకు రాగానే శశికి మనోహర్ మాట జ్ఞాపకం వచ్చింది. ఇంకెక్కడి మనోహర్. ఆనిర్మలు డప్పుడే కండ్లుమూసేడు.

♦ ♦ ♦

చంద్రుణ్ణి చూస్తూ ఆనిర్భాగ్యురాలు యిలా అనుకుంది. "మగనినైనా లేపకుండా పరుగు పరుగున క్రిందికొచ్చి ప్రాణాలు రక్షించుకున్నా! ఎంత స్వార్ధపరురాలను!" ఆనాడు జరిగిన సముద్ర సంఘటన జ్ఞాపకం వచ్చింది. ఊగిపోతున్న అలలలో నడిసముద్రంలో అభయంకర వాతావరణలో తన మగడు ప్రాణాలు రక్షించుకున్నాడని బ్రతికున్నన్నాళ్లు దెప్పి పొడిచింది. ఇప్పుడు తను ...? తనదాకా వస్తే... ఆనాడు తన్ను నావికుడు రక్షించాడు. ఇప్పుడు తన మగణ్ణెవరు రక్షించారు? "సుఖమెరుగని జీవితా" లంటే ఇలా ఉంటాయికదా! శశి కన్నీరు మున్నీరయి పోయింది.

♦ ♦ ♦

ఇప్పుడామె ఒకపిచ్చిది. ఆమెజీవిత సందేశం యిది. "ఆత్మ సంరక్షణ మప్పుడు ఆత్మబంధువు లేనా జ్ఞాపకంరారు!"

"సుఖమెరుగని జీవితాలు" ఈవిశాల ప్రపంచంలో జీవించడం కంటే ఒక్కసారి గుక్కెడు ప్రాణాలు పోగొట్టుకోడం ఉత్తమం.

# ఇదా సమయము?  

శ్రీమతి యస్. సి. వేణి, బి.ఎ బి.యిడి.

అడుగిడంగ శక్తి నావంతయున్ లేక పొట్టచేతబట్టి పొంగిపొరలు
దుఃఖ మణచియణచి తూలుచున్ లేచుచు ఆశనాల్గుదిక్కు లరసియరసి.

అరువశక్తిలేక నాకలియును చిచ్చు రగులుకొనగగోసి ప్రాణములను
నిలచె తడవొకింత నేత్రముల్ మాలించి ధరను వ్రాలెనటులె దప్పిసిల్లి.

వెనుకముందులేని బిక్షుబాలుడతడు ఆప్తులెవరులేని యర్భకుండు
వేరెతావులేక వెతకులాడెడువాడు లోకగతితెలియని లుబ్ధుడతడు.

కొంతవడికిలేచి గొణుగుచునేమియో కళ్ళువిప్పి తుదకు గలయజూచె
తడవుసైచి యతడు దవ్వులగన్గొనె భవనమొకటి యింద్రవైభవమున.

లేనిశక్తిబూని లేచిబయలుదేరె చేరె ప్రాంగణమును చిటికలోన
నేమియోదలంచి నేదియోనూహించి శాంతచిత్తుడౌచు సంభ్రమమున.

"ఇప్పుడొచ్చితేల నింతగాపొగరెక్కె వంటలైన సిద్ధపడగలేదు
భోజనంబులైన మొదలిడంగాలేదు పోర! ఎట్లువచ్చు ముందునీకు.

ఆ పరాత్పరునికినైన నైవేద్యంబు బెట్టలేదు! నీకు బెట్టుటెటుల
ఏమి! అన్నమడుగ నిదియేన సమయంబు సిగ్గులేదెయిపుడు సిద్ధపడగ."

మళ్ళివెనుకదారి మారుమాటాడక ఏమిచేయలేక నీసుదలచి
చెట్టునీడనతడుచేరి సొమ్మసిలెను పడియెనటుల దీనబాలకుండు.

  

రెండుజాములయ్యె రెప్పల్ విరిచిజూచె అంతయున్ దలచి నాత్మకలగ
తనకుదానెదెప్పి తనకర్మమనియెంచి భావితంబుగూర్చి పరితపించె.

ఎట్టివారలైన నిష్టమైనిడతురా కోరి ప్రాణములను గూర్మివిడచి
ఎట్టిహింసలకును నెలమిసహింతురు గాని సిద్ధపడరు కాయమొదల.

బాలకుండు తలనుపంకించి నిట్టూర్చి మెల్లగానులేచె నుల్లమదుర
ఐనజూతుకాకయంచు బయలుదేరె చేరినాభవనము శీఘ్రగతిని.

అరచె గుమ్మమెదుట యజమానిజూచుచు మరలమరల బిలచె మందలమున
"అయ్యా! యాంగజాల నాకలిమంటకు పట్టెడన్నమైన బెట్టరయ్యా!"

"ఓరి! నీచ! భడవ! నొకమారుజెప్పంగ మరలవచ్చితౌర! మాయకాడ!
జ్ఞానమింతలేదు! ఛవట పోషామ్మింక? కదలవేల నీవు వదలవేల?
ఏలగోలచేతు విదియేనసమయంబు భోజనంబులన్ని ముగిసెనిపుడె
సిగ్గులేదె నీకు శీఘ్రమే కడలుమా ఇట్టిసమయమేల యెంచినావు!"
"మరలరమ్మనమని మాటజెప్పిరిగాదె మార్చుదేలనయ్య మాటయిపుడు
వచ్చినాడ మీరు బల్కినరీతిగా బిచ్చమైనగాని బెట్టరయ్య."
"హా! ఇదేమి! జ్ఞానమణుమాత్రమున్ లేక బదులుచెప్పెదు వీవు భయములేక
జంకుగొంకులేక చరియించుతువీవొర. బిచ్చమడుగ నీకు వేళఇదియ!
పెంకివాడవీవు! పిట్టకొంచెము కూత ఘనమనంగ నివుడెకాననయ్యొ!
కూలినాలిచేసుకొని బ్రతుకంగరాద! ముష్టిబ్రతుకిదేల ముష్టివెధవ."

♦ ♦ ♦

హాయని జేరవచ్చు ననహాయులకున్ సమయంబునెంచకన్
బాయని ప్రేమతో మృదులవాక్కుల బల్కుచు నూరడించుచున్
ధీయుతి లేమియున్ కలిమిద్రుంచి సదా తనకున్నదానిలో
సాయముచేయువా నొరతసద్గుణ దాతలుగారె పో! యిలన్.
తోడిమానవులను తోరపుప్రేమతో ఆదరించి గాచునట్టి జనుల
దయదలంచుగాదె దైవంబుయేవేళ దీనపోషణమ్మె దేవపూజ.

---

ఒకయువతి ఒక వ్యాపారసంస్థలో 25 సంవత్సరాలుగా పనిచేస్తూయుండి చిన్న గుమాస్తాగిరినుండి ప్రైవేటు సెక్రెటరిగా నియమించబడిన సందర్భమున ఒక చిన్నవిందు ఏర్పాటుచేసింది. ఆసమయమున ఆసంస్థమేనేజరు యీ క్రిందివిధంగా ఉపన్యసించాడు;

"సాధారణంగా స్త్రీలకు ఉద్యోగాలు వారి అందాన్నిబట్టి, చమత్కారాన్నిబట్టి లభిస్తున్నవి కాని సమర్థతనుబట్టి కావని చాలామంది అంటుంటారు. అయితే మనకీరోజు ఆతిథ్యమిచ్చినామెను ఒక్కసారి చూచినచో అదిచాల పొరబాటైన అభిప్రాయమని రుజువు కాగలదు."

---



# ఝాన్సీ రాణి

శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(గత సంచిక తరువాయి)

రాణి.-(వెనుదిరిగి) అరే...నీవెప్పుడొస్తివి? విచారంగావున్నావేమి? యేమిటాలోచిస్తున్నావు?

కిరణ్:-ఇంకేమాలోచించెదను? ఆకాశమంతటా ఆపదలనెడి మేఘాలు అలముకుంటున్నవి. ఇవి యెప్పటికి తొలగి సుఖమనే సూర్యుడు గానవచ్చునాయని గ్రుడ్లనీరు గ్రుడ్ల గ్రుక్కుకుని-దుఃఖాన్ని దిగమ్రింగి వచ్చియుంటిని; కాని హృదయాగ్ని శాంతించకున్నది. రగులుచునేయున్నది. భవిష్యాంధకారం దట్టమగుచున్నది. ఇప్పుడేమిగానున్నది సోదరీ?

రాణి:-యేమీగాదు కిరణ్; యేమిగావలయునో చెప్పుము. పిరికిపందలకు, నిర్వీర్యులకు-యెప్పుడూ - యేమిగానున్నదో యన్నభయముండును. జయాపజయములు నొసట వ్రాతనుబట్టి యుండునన్న భావములో వుంటారువాళ్లు. పరాక్రమవంతులెప్పుడూ యాపదలనెదుర్కొంటూ అదృష్టాన్ని అనుకూలపరచుకుంటూ; యేమిజరగాలిప్పుడను కొంటూవుంటారు. జీవితమే ఒక సంగ్రామము. సంగ్రామమున నిలబడగలిగినవాడే జీవించుట కధికారి. నిరాశ జెందుట కిందేముంది?

కిరణ్:-చెప్పింది బాగుగనేవుంది. కాని ఒకదానిపై ఒకటిగా క్రొత్తక్రొత్త కష్టాలు వచ్చి పైబడుతుంటే హృదయముండబట్టే దెలాగు? చిన్న రాకుమారుని గోల్పోవడమూ - అకస్మాత్తుగా రాజుగారు కన్నుమూయడమూ - ఇంతలో యిప్పుడు మళ్లీ రాజ్యం వుంటుందా పోతుందా అన్నవిషయం హృదయాన్ని కలతపెట్టడం - కింకర్తవ్యవిమూఢులగా విస్తున్నై - కూర్చుని జీవితాంతం యేడవాలనిపిస్తోంది.

రాణి:-గాభరాపడడం దౌర్బల్య లక్షణం సోదరీ! నేనీయాపదల నెరుగనని నీయూహాయా! వీటియనుభవం నాక్కూడా వుంది. హృదయమందొక యగ్నిగోళముంది. కాని దాన్ని అచ్చటే అణచి

పెట్టి వుంచాను. కష్టాలకు భయపడి కర్తవ్యచ్యుతులుగా రాదు. మానవుడు బ్రతకడాని కొచ్చాడు. యెప్పుడూ కర్తవ్యోన్ముఖుడై వుండాలి. సుఖదుఃఖాలనేవి జీవితమనే నదికి యిరువైపులనుండు గట్లు. యీ కట్టలను తాకుచూ జీవిత ప్రవాహం పురోగమిస్తుంటుంది. ఇందు భయపడాల్సిన విషయమేముంది? సుఖముగా వున్నప్పుడంతా నవ్వుతూ సంతోషంగావుంటారు. కాని దుఃఖాలు (కష్టాలు) చేకూరినప్పుడు నవ్వుతూ సంతోషంగా వున్నవాడే జీవించుట అర్థం జేసుకున్నవాడు. యదార్థానికి. చావు బ్రతుకులు ప్రపంచమందు పరిపాటే. వచ్చినవాడు తప్పక వెళ్ళును. అందుకోసం యేడుస్తూ మొత్తుకుంటూ కూర్చోవడమంటే అర్థంలేదన్నమాట. "ఆత్మ అమరమైనట్టిదని - అవినశించదనీ - శరీర రూపములోవున్న వస్త్రం పోతుంటుందనీ'' గీతబోధిస్తోంది. యీ విషయం నీ వెరుగుండి కూడా యేమి జేయాలను కుంటున్నావు - పనిమాని పండలాగా కూర్చుని యేడుపు ప్రారంభించాలను కుంటున్నావా?

కిరణ్:-కాని సోదరీ! యిది జెప్పడమెంత సులభమో యేమిజేయాలన్నదికూడా అంతే సులభమా?

రాణి:-సాధ్యా సాధ్యములన్న పరిభాషెప్పుడూ మానవునిశక్తిపై యాధారపడియుండును. అసలువిషయం యేదీ కష్టంగాదు. యేదీ సులభంగాదు. మానవుడు చేసినపని సులువైనది. చేయలేనిది కష్టమైనట్టిదగుచున్నది. అటువంటప్పుడు ప్రయత్నించకనే గుంజాటనలో పడడమంటే? కిరణ్! నీవు నాసోదరివి - ఝాన్సీరాణికి సోదరివి - నీవు యీ విధంగా ప్రలాపించుట యుక్తమా?

కిరణ్: ఇందులో పొరపడ్డావు రాణీ. నేను నీ సోదరినేగాదు, ఒక మహిళనుకూడాను. స్త్రీకి పతి, పుత్రుడు, సంసారము; యేమిటో - ఒకసామాన్య స్త్రీ ఆలోచించి అర్థం జేసుకున్నటుల ఒకరాణి అర్థం జేసుకోజాలదు.

రాణి:-అంటే నీవుద్దేశ్యం....

కిరణ్:-అంటే అని నన్నడగక సోదరీ? వసించకముందే వల్లకాడైన ప్రపంచాన్నడుగుము - వికసించక మున్నే వాడిలిపోయిన మొగ్గనడుగుము - వెలుగకముందే ఆరిపోయిన వత్తినడుగుము. అప్పుడు బహుశా మీకు బాగా అర్థం కాగలదు. సోదరీ! నదీప్రవాహములో కొట్టుకొని పోతున్నవారిని; నీవు ఆలోచించకుండా పడవెక్కి తిరా యనుచున్నావు. మెడమీదికి కత్తిపడుచుండ గాథ రాజెంద వలదనుచున్నావు. ఇదంత సులభ సాధ్యమా? దుఃఖాన్ని దిగమ్రింగుటొక మెత్తూ - హృదయాన్ని రాయి జేసుకొనుట సామాన్య విషయం గాదు సోదరీ.

రాణి:-అయితే కన్నీరుగార్చినంత మాత్రమున రానున్న యాపదలు తొలగునని నీవిశ్వాసమా? పరిస్థితులను అశ్రుపూరిత నయనాలు యెదుర్కోజాలవు కిరణ్. కీర్తిశేషుడగు పతిదేవుని ఆదేశాలు పాలిస్తూ వారి లక్ష్యాలను సిద్ధింపజేస్తూ. ఝాన్సీ రాజ్యాన్ని పాలించగలందులకు హృదయాన్ని రాయి జేసుకోవడమే గాదు, అవసరమైతే వుక్కుగా మార్చుకుంటాను. మైనములాంటి మహిళా హృదయం కరిగిపోవడమే యెరుగున్నది గాని మరేమీ చేయజాలదు. ప్రపంచము నశించడానికే యేర్పడ్డదనీ - మొగ్గలు ఒడిలిపోవడానికే వికసిస్తవనీ - దీపం ఆరిపోవడానికే వెలుగు చున్నదనీ - నీవెందు కాలోచింపవు? పరివర్తనకు మారుపేరే ప్రపంచం. అటువంటప్పుడు నీకీ మమతెందుకు? విచారమెందుకు? బ్రతికిన రెండురోజులైనా ప్రతిభావంతంగా బ్రతుకుము. తిరిగిన రోజొక్కటైనా దర్జాగా తిరుగుము. పిరికితనమునకు స్థానమెందుకిస్తావు?

కిరణ్: నీకు సమాధానము జెప్పజాలను సోదరీ. యేమిజేయవలయునో జెప్పుము?

రాణి:-మన మేమి జేయవలయునో కాలమే నిర్ణయించును. స్వర్గీయ పతి దేవుని యాదేశానుసారం ఝాన్సీ రాజ్యపాలనా భారం స్వీకరించి నిర్వహించుట ప్రస్తుత కర్తవ్యం. కష్టపరంపరలు అలలుగా పొంగి పైబడుచున్నప్పటికీ చలించక సాహసించి తారసిల్లవలసినదే.

కిరణ్:-కాని సోదరీ! నీవైపు చూడగనే దుఃఖము పొంగి పొరలి వస్తున్నది. సుఖము లభించకున్న మానె - శాంతంగానూ, సంతోషంగానూ - జీవించడం కూడా దుర్లభమేనా యన్నట్లున్నది.

రాణి:-ఇందులో దుఃఖించవలసిన విషయమేముంది? దుఃఖమునకు బదులు ధీరత్వమునుగలిగి యుండుము. మానవుడు మనోవాక్కాయ ఖర్మలా అనుకొన్నది సాధించ గలుగుచున్నాడు. ఉద్దేశ్యాలెప్పుడూ వున్నతంగా నుండాలి. నా చదువు సంధ్యలన్నీ పురుషులతో పాటు జరిగిన వన్న విషయం బహుశా నీకు తెలసివుండ దనుకుంటాను. ఒకసారి వేటకు బోవునప్పుడు యేనుగుపై నెక్కిపోతానని పట్టు బట్టాను. నీకా భాగ్యం కూడా వున్నదా అని తండ్రి విసుక్కున్నాడు. ఒకటిగాదు పది యేనుగుల నెక్కే భాగ్యమున్న దన్నాను. నేడు నీకు తెలుసునుగదా యెన్ని యేనుగుల నెక్కగలనో.

కిరణ్:-నిజమే.. సమ్మతిస్తాను. గాని... అనకూడదనుకో ... ఒకవేళ యీ రాజ్యాన్ని ఆంగ్లేయులు హస్తగత మొనర్చుకుంటే?

రాణి:-పోరాడి లాక్కుంటాను. అధికార సంరక్షణార్థం పోరాడే శక్తి మనలో వున్నంత వరకు యెవరూ స్వాధీన పర చుకో జాలరు. అధికార సంరక్షణార్థం ఆత్మార్పణ జేయుటే మహోత్తమ కృత్యం.

కిరణ్: కాని ...

రాణి:-బహుశా నీవు యుద్ధంలో విజయం లభించుకున్నట్లై తేనో? అని ఆలోచిస్తు న్నట్లున్నావు. అది మనకనవసరము. అధికార సంరక్షణార్థం ఆత్మార్పణ జేస్తాము. జయాప జయముల భేదము లేదు. ఎట్లైనా జయము లభించినట్లే కిరణ్!

కిరణ్:-సరే బాగుంది. నేనేమి జేయాలనో జెప్పుము.

రాణి:-భూతకాలాన్ని విస్మరించి-భవిష్యత్తు కెదురు చూడక ప్రస్తుతం పరోపకార ముల నెరవేర్చుము. పరులదానికి అఘో రించకు. ఉన్న దానితోనే సంతృప్తి జెందడం నేర్చుకో. పరివారాని కంత టికీ జ్యోతి యీ దామోదరరావే. ఈ జ్యోతి బలంతోనే అంధకారంతో పోరాటం సాగించాలి కిరణ్.

దామోదర్రావు:-(ప్రవేశించి) అమ్మా! నాకత్తి విరిగిపోయినది. ఇప్పుడే కత్తితో యుద్ధం చేయను? యుద్ధకళ నేర్చుకునేదెట్లు?

రాణి:-(ప్రేమతో) ఒక కత్తి విరిగిపోయి నంతమాత్రమున కేమిగాని సాహసము వుడిగిపోరాదు. అప్పుడు వాటంతటి వే కత్తులెన్నో వచ్చును నాయనా? మరొక కత్తి తెప్పించెదనులే. పరాక్రమవంతుడగు బాలుడు భయపడడు.

దామోదర్రావు:-పెద్దకత్తి కావాలి నా కమ్మా! బాబాయి కత్తి అంతటిది కావాలి. చిన్నకత్తితో శత్రువుల జయిం చుట కష్టమని నరేశుడు చెపుతుండే వాడు.

రాణి:-శత్రువుల జయించుటకు కావలసింది పెద్దకత్తిగాదు బాబూ సాహసము. పెద్ద కత్తే తెప్పించెదనులే. (వ్రేలాడుచున్న కత్తిని చూపించి) చూడు బాబూ! యిది మీబాబాయిగారి కత్తి. దీనిని చూడగానే శత్రువులుగడగడలాడేవారు. మీబాబాయిగారి యీకత్తి చిన్న పెద్ద యుద్ధములన్నింటా, విజయమే గాంచి నది. చిన్నప్పటినుండీ నాతో వున్న యీ నాకత్తి యెన్నడూ వంగిమెరు గదు. అట్టికత్తినే నీకిత్తును బాబూ! కాని విరిగిపోతే పోయిందిగాని, యిత రులముందు అది వంగిపోరాదు.

దామోదర్రావు:-లేదమ్మా దాన్నెప్పుడూ వంగనీయను. శత్రువుల శిరములపై మెరయుచుండును.

రాణి:-సెబాష్ పుత్రకా! అదే నా యాశ! అయితే బాబూ! శత్రువులు యెదురు తారసిల్లినప్పుడేమి చేయాలి?

దామోదర్రావు:- వెంటనే వారిపై కురకాలి.

రాణి:- వెనుక పాటున వుంటే?

దామోదర్రావు:- వారికి ... ముందుకొచ్చే అవకాశ మివ్వాలి.

రాణి:-(సంతోషంగా) నీవు నాగారవాన్ని తప్పక కాపాడగలవు. కిరణ్ ! ఇవ్వాళనే వీనికొక కత్తిని తెప్పించి యిమ్ము.

కిరణ్:-ఎందుకని బాబూ, వ్యాయామశాల నుండి నేడు తొందరగా వచ్చినావు?

దామోదర్రావు:- నరేశుతో పోట్లాడు తుండగా కత్తివిరిగి పోయినది. నేను కత్తి విశిరితిని. వాడు డాలు అడ్డము బెట్టినాడు. కత్తిబటివిరిగాబోలు ... విరిగి పోయింది. ఇంకా చేసేదేముంది మరి ? వచ్చివేసితిని.

దాసీ:-(ప్రవేసించి) దివానుగారు వచ్చిరండీ.

రాణి:-యెల్లుండి దర్బారులో కలుసుకో మన్నానని చెప్పుము. అన్నివిషయాలూ అక్కడనే మాట్లాడుకోవచ్చుననికూడా చెప్పుము. వెళ్లుము. పోదాము పద బాబూ ?

(అంతా నిష్క్రమింతురు)

(నశేషము)



# మహోపకారం

శ్రీమతి టి. అనసూయాదేవి

హోరుమని వర్షము క్షోణీపాతంగా కురుస్తోంది. కారుమబ్బులు, ఉరుములు, మెరుపులతో ఆకాశం ఆవరించియుంది. తూరుపువైపు కిటికీలోనుంచి పచ్చని చెట్లతో కప్పకొనియున్న కొండలు మెరుపుల వెలుతురులో కనుపిస్తున్నవి. వర్షము క్షణ క్షణానికి అధికమగుచున్నది. ఏమీతోచక బల్లమీదనున్న పుస్తకములను తిరగేస్తున్నాను. ఇంతలో ఎవరో తలుపుతట్టినట్లు శబ్దమయింది.

"అక్కా! ఎవరో తలుపు తడుతున్నట్లుంది" అన్నాను.

మా అక్క కాంతం వెళ్ళి తలుపుతీసింది. తడిసిన బట్టలతో మా బావ మద్రాసునుండి మెయిలు దిగి వచ్చాడు. ఇంట్లో మా అమ్మ, నాన్న లేరు. మా బావకు స్నానానికి నీళ్ళక్రింద మంటపెట్టడం మొదలుపెట్టింది. ఇంతలో మా స్నేహితురాలు సరస్వతి ఏదో పుస్తకము చేతబట్టుకొని మా ఇంటికి వచ్చింది. వర్షము యింకా కురుస్తునేయున్నది. సరస్వతి రాక నాకు చాల ఆనందం కలిగించింది.

"నీవు యీ వర్షములో రావేమోననుకొన్నాము. మా అమ్మ, నాన్న ఎవరు లేకపోవడమువలన బిక్కుబిక్కుమంటూ ఏమితోచటంలేదు. ఇంతలో మా బావ మద్రాసునుండి రైలుదిగి వచ్చాడు" అన్నాను.

ఆమాటలు వినగానే సరస్వతిలో ఏదో మార్పు కనుపించింది.

మా బావ "ఎవరా అమ్మాయి" అని అక్కను అడిగాడు.

"ఆయమ్మాయి భర్త మద్రాసులో లా చదువుతున్నాడు. మేనరికంచేశారు. ఆమె తండ్రికివేరు సంతతిలేదు. తర్డుఫారము చదివి ట్రెయినింగుకువెళ్ళి ప్రస్తుతము గరల్‌స్కూలులో టీచరుగా పని చేస్తున్నది. చాల అందమైనవాడని, తనకుమార్తెకు తగినవాడని, పైగా చిన్నప్పటినుండి తనయింట్లో యుండే చదువుకొంటుండేవాడు; కాబట్టి మగపిల్లలు లేనికారణమువలన అన్ని విధముల ఆలోచించి సరస్వతిని రామారావుకిచ్చి వివాహం చేశాడు.

కాని పట్నవాసపు విలాస జీవితము మూలంగా త్రాగుడు అలవాటుఅయి రెండు సంవత్సరములలో 20000 రూపాయలు ఖర్చుపెట్టాడు. చదువుకు సయితము స్వస్తిచెప్పాడు.

భార్య పుష్పవతిఅయింది. ఈమధ్య తండ్రికి చాల జబ్బుచేసి టెలిగ్రాం యిచ్చినను రాలేదు.

రామారావు తండ్రి గౌరవనీయుడు; కొడుకును మందలిస్తూ "మనఐశ్వర్యమునంతయు దుర్వినియోగం చేస్తున్నావు. ఒక పరస్త్రీలోలుడవై అగ్నిసాక్షిగా వివాహమాడిన భార్య గొంతు కోయడం న్యాయం కాదు. మనవంశానికి కళంకము తెస్తున్నావు. ఇంతచదువు చదువుకొని అజ్ఞానాంధకారములో మునిగిపోతున్నావు. వృద్ధాప్యములోనున్న నన్ను, మీతల్లిని, చేసుకొన్న భార్యను సంతోషపెట్టవలసిన నీధర్మమును గుర్తించు" అని జాబు వ్రాశాడు దానికి జబాబులేదు. తల్లిదండ్రులు, అటు అత్తగారు క్రుంగి క్రుసించి పోతున్నారు." అని అన్నము పెడ్తూ మా అక్క బావతో చెప్పింది.

మా బావ తెల్లబోయి "రామారావు నా స్నేహితుడు, అతనిని నేను అనేకసార్లు మందలించాను వినక బంగారములాంటి భార్యనువదలి పరస్త్రీ లోలుడైనాడు. ఈసారి మద్రాసునుండి వచ్చేటప్పుడు పిలుచుకొనివచ్చి భార్యాభర్తలను జత పరుస్తాను" అన్నాడు.

మరునాడు మా నాన్న, అమ్మ వచ్చారు. అక్కను వెంటబెట్టుకొని మా బావ మద్రాసుకు వెళ్లిపోయాడు.

ఒకనాడు మా అక్క, బావకలసి బీచికివెళ్లారు. దారిలో రామారావు కనుపించి "హల్లో!" అని పలుకరించాడు.

మా బావ "రామారావు! ఒకసారి మాయింటికి రారాదూ! కొన్ని విషయాలు నీతో ప్రైవేటుగా మాట్లాడాలి" అన్నాడు.

"ఆదివారంనాడు మీకు శలవు కాబట్టి ఆనాడు తప్పక వస్తాను" అని చెప్పి రామారావు వెళ్లాడు.

సాయంత్రము 6 గం॥లయినది. ప్రభాకరుడు పశ్చిమదిశ నలంకరించాడు. చంద్రోదయానికి పూర్వము వచ్చేపిల్లవాయువులు అప్పుడే కొంచము కొంచముగా సాగుతున్నవి. మధ్యాహ్నపు వడగాడ్పులకు వెసబోయిన ప్రాణులు అప్పుడప్పుడే కోలుకొంటున్నవి. మా బావ వాలుకుర్చీలో కూర్చొని పేపరు చదువుకొంటున్నాడు. రామారావు రిక్షాదిగి వచ్చాడు. ఎదురుగానున్న కుర్చీ చూపిస్తూ ఆహ్వానించాడు మా బావ.

మౌనాన్ని భేధిస్తూ మా బావ "రామారావు! నీతో ఒక విషయం చెప్పదలచుకొన్నాను. నా మాటవింటావనే నమ్మకంతోనే సాహసిస్తున్నాను. నీకది హితవుగా కనుపించకపోవచ్చును. ముందు ముందదే సౌఖ్యదాయకమవుతుంది" అన్నాడు.

రామారావు 'ఏమిటబ్బా! అది' అన్నట్లు చిరునవ్వు వెలిబుచ్చాడు.

"నీబాగును ఆశించే చెప్తున్నాను. ఈ డబ్బు దుర్వినియోగమేమిటి? పంటవంటి సంసారమును, నీకొరకు తపించిపోతున్న బంధుమిత్రులను తృణీకరించడము ఏమి బాగున్నది? నీతోటివాళ్లం మేమంతా కాపురము చేసికొనడంలేదా? వంశమర్యాదను నిలబెట్టుకోవాలి కాని కళంకము తెచ్చుకోడం నీవంటి ప్రాజ్ఞులకు తగినది కాదు. నీవంటి విద్యావంతునికి, నీవు ప్రస్తుతం అవలంబిస్తున్న విధానం సబబైనది కాదు. త్రాగుడుకు అలవాటుపడటం అజ్ఞానులకు సహజం కావచ్చు కాని నీబోటివాడికి కాదు. త్రాగుడుకు అలవాటుపడి పరస్త్రీ లోలురైనవారు ప్రపంచములో నెవరు బాగుపడిరి. దినదినానికి నీ ఐశ్వర్యముతోబాటు ఆరోగ్యము క్షీణిస్తున్నది. ఈ విధంగా నింకా కొంతకాలము గడచినచో సర్వము నాశనమగునని గుర్తించు. నామాటవిని వృద్ధులగు తల్లిదండ్రులమాట లాలించు. నీ ప్రస్తుత స్థితిని చూచిన నీవారు క్రుసించిపోతున్నారు. నీ సత్ప్రవర్తనచే వారిని ఆనందింపచేయుడం నీ ధర్మం. ప్రత్యక్ష దైవము తల్లిదండ్రులే కాబట్టి వారి ఆశీర్వాదములు అభివృద్ధికితోడ్పతవి. నీభార్య విద్యావతి. అందగత్తె. ఆమెను స్వీకరించి ఆదర్శవంతమైన జీవితమునుగడపి అత్తమామలకు, తల్లిదండ్రులకు, నీ శ్రేయస్సునుకోరే యితర బంధు మిత్రులకు సంతోషమును చేకూర్చి సుఖించు" అన్నాడు మా బావ.

రామారావు అందుకు తటపటాయించాడు. కాని మా బావ "మనమిద్దరం ఒకసారి మీ అత్తగారి యింటికి వెళ్దాం. పరిస్థితులనుబట్టి నీదారి నీవు చూచుకొందువుగానిలే" అన్నాడు.

రామారావు ముఖంలో అంగీకారం కనుబరచాడు.

"రేపే వెళ్దాం. ఇందుకోసరమని నేను ఆఫీసుకు సెలవు పెట్టాను" అన్నాడు మా బావ.

అది చైత్రమాసం. హటాత్తుగా ఆకాశమంతా మబ్బులు కమ్మినవి, గాలితోకూడి హోరున వర్షము ప్రారంభమగుతుందేమోననిపించింది. గాలికి కిటికీ తలుపులు టప టపా కొట్టుకొంటున్నవి. ఒక మెరుపు మెరిసింది. దాని వెలుతురులోనుండి సరస్వతి ఆమె తల్లి జట్కా బండి దిగివస్తున్న రామారావును, మా బావలను కిటికీలోనుండిచూచి తలుపుతెరచారు.

"రామారావు వచ్చాడండీ!" అన్నది సరస్వతి తల్లి.

వెంకటరావు నిర్ఘాంతపోయాడు. వెంబడే వాళ్లిద్దరిని లోపలకు తీసికొనివెళ్లి కుర్చీలలో కూర్చుండబెట్టాడు. అంతలో సరస్వతితల్లి కాళ్లు కడుగుకోడానికి నీళ్లు, గ్లాసులతో మంచినీళ్లు తీసికొనివచ్చి యిచ్చింది.

"అలాగున్నావేం బాబూ! పున్నమ చంద్రుని బోలిన నీ ముఖము యిలాగున్నదేమిటి? నీకండ్లు ఎలాగ లోనికి పీక్కెళ్లినవో చూడు. సమధిక విజ్ఞానవంతుడవైన నీదుష్ప్రవర్తనకిది ఫలితమన్నమాట. మీతల్లిదండ్రులమాట వినకపోవుట నీకు వర్ధమాన లక్షణం కాదు. ఇప్పటికైన గడచినదానికి పశ్చాత్తాపపడి నీభార్యతో సుఖంగా కాపురంచేయిబాబూ! మేము అందరంకూడ ఆది

చూచి సంతోషించాలనే యింతకాలం ఎదురు చూస్తూ జీవితం గడుపుతున్నాము. మాకంటె నీ హితము కోరువారెవరు బాబూ" అన్నది అత్తగారు.

రామారావు వంచినతల ఎత్తలేకపోయాడు. అప్రయత్నంగా కండ్లవెంబడి నీళ్లు బొటబొట కారినవి.

మామయ్య లేచి నిలువబడి "నేనిక సెలవుతీసుకొంటాను. నేను అనుకొన్నపని అయింది. ఇక మీరూ మీరూ అంతా ఒకటి. రామారావు! సరస్వతి అదుగో నీ ఎదుటనున్నది. మీ ఆనందమయమైన దాంపత్యమును చూచి మురిసిపోవడానికి తల్లిదండ్రులు, అత్తమామలు కనిపెట్టుకొనియున్నారు" అని చెప్పి బయలుదేరి వెళ్ళాడు.

అది వెన్నెల రాత్రి. భోజనమయి రామారావు డాబామీదకు వెళ్లి వాలుకుర్చీలో కూర్చున్నాడు. చంద్రుడు ఆనాడు మహానందంతో నున్నాడేమో నన్నట్లు పిండారబోసినట్లు వెన్నెల కాస్తున్నది. సరస్వతి మంచినీళ్లచెంబు పట్టుకొని డాబామీదికి వచ్చింది.

రామారావు సరస్వతిని ఎలాగ పలుకరించాలనో అర్థంకాక తబ్బిబ్బులగుతున్నాడు. లేచి మెల్లగా సమీపించి "సరసూ! నిన్ను యింతకాలం నిరాదరణతో చూచి తీరని అపచారం చేశాను. నీవు నన్ను క్షమించి ప్రణయభిక్ష పెట్టినందులకు కృతజ్ఞుడను" అన్నాడు చెక్కిళ్ళను స్పృశిస్తూ.

సరస్వతి పెదవులమీద చిరునవ్వు తొణికిసలాడింది.

"ఇదంతా దేవి బావగారి మహోపకారఫలితం" అన్నది సరస్వతి మెల్లగా.

వెన్నెల కాంతులలో ధవళదేహచ్ఛాయ, విశాల నేత్రాలు, గుండ్రని మొగములతో, ఆమె దేవకన్యయేమోననిపించింది. రామారావు ఆమెతల నిమురుతూ "నీవు దేవలోకంలో నుండవలసినదానవు సరస్వతీ! పొరబాటున యీలోకంలో పుట్టావు" అన్నాడు.

"మరిమీరూ - మన్మథుడై యుండాల్సింది; పొరబాటున..." అంటూ తన బాహువులతో తన భర్త కంఠాన్ని చుట్టేసింది.

——(o)——

# చర్మబాధలన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనియై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది. కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.






## గోధుమ హల్వా

గోధుమలు 1 శేరు, పంచదార 1 శేరు, నెయ్యి ½ శేరు; గోధుమలు రాత్రి నానబోయవలెను. ఉదయము వాటిని మెత్తగా రుబ్బి గుడ్డతో పిండి పాలుతీయవలెను. పొయ్యిమీద గిన్నె ఉంచి, పంచదార అందులోపోసి పాకమువచ్చిన తరువాత ఈ పాలు అందులోపోసి కలుపుతూయుండవలెను. అది ముద్దవలె అయినవెంటనే నెయ్యి అందులోపోసి ఏలకుపొడి, బాదం, జీడిపప్పులు సన్నముక్కలుగా తరిగి వాటిమీద జల్లవలెను. చల్లారినపిదప ముక్కలుగా కోయవలెను.

## నిమ్మకాయ చారు

బాగుగా పండిన నిమ్మకాయలు 3. పొయ్యిమీద పాత్రనుంచి, కొద్దిగా నూనెపోసి అందులో కొద్దిగా ఆవాలు ఎండు మిరపకాయముక్కలు, మినపపప్పు. కరివేపాకు పోపువేసి, పోపువేగనిచ్చి 1 శేరు నీళ్లు పోయవలెను. దానికి తగుఉప్పువేసి పసుపుపొడి కొద్దిగా వేయవలెను. బాగుగా మరిగిన తరువాత దింపి, ఈ నిమ్మకాయలు ఒక గిన్నెలోనికి రసముపిండి, అందులోయున్న గింజలు తీసివేసి ఆ రసము ఈ దింపిన నీళ్లలో పోయెవలెను. దీనిని నిమ్మకాయ చారందురు. ఇది పత్యమునకు చాలామంచిది.

కామాడ అమ్మాజీదేవి.

## వాకకాయుల పచ్చడి

వాకకాయలను కొన్ని ప్రాంత్యములందు కలేకాయలనికూడ అంటారు. పుల్లగా నుంటవి. వాక కాయల పచ్చడి చాలరుచిగా నుండును.

పదిపలముల కాయలను తరిగి అందులోని పప్పులను తీసివేసి, నూనెలో వాడ్చి యుంచుకోవలెను. జీలకర, ఆవాలు, ఇంగువ, ఏడెనిమిది ఎండు మిరపకాయలను నూనెలో వేయించి వాసన వచ్చునపుడుమున దించవలెను. వాడ్చినకాయలను, వేయించిన జీలకర అవాలు, ఇంగువ మిరపకాయలను, తగినంత ఉప్పు వేసి పచ్చడిగా నూరి వాడిన చాలరుచికరముగా నుండును.

## వాకకాయలను పప్పులో వేయుట

కాయలను తరిగి అందులోని పప్పులను తీసివేయవలెను. రెండు మూడు పెద్ద ఉల్లిపాయలు, నాలు గయిదు పచ్చిమిరపకాయలను చిన్న చిన్నముక్కలుగా తరిగి యుంచుకొనవలెను. పొయ్యిమీద కందిపప్పుకాని, పెసరపప్పుకాని షుమారుగా ఉడుకనిచ్చి తరిగి యుంచుకొనిన వాకకాయల, ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయల ముక్కలను ఉడుకుచున్న పప్పులో వేసి కొంచెము పసుపు వేయవలెను. ఇష్టమున్న వారు ఇంగువ కూడా వాడవచ్చును. బాగుగా ఉడికిన తరువాత తగినంత ఉప్పువేసి కొంచెముసేపు పొయ్యి మీదనుంచి దించవలెను. వెంటనే ఆవాలు, జీలకర, మినపపప్పు, కరివేపాకులను కొంచము నూనెలో వేసి సువాసన వచ్చువరకు వేయించి దించిన పప్పులో తిరుగపోతపెట్టి వాడవలెను. ఇది చాల రుచికరముగా నుండును. అన్నములో కలుపుకొని తినుటకే కాక గోధుమ రొట్టెలలోనికి సయితము అనువుగా నుండును.

చివుకుల లక్ష్మీకాంతమ్మ

——(o)——

# కాని కాపురం



ఉదయమునుండి యింటిపనులోపికఁ జేయుచు, వచ్చుబంధులన్
ముదమున నాదరించుచును బోరిడుపిల్ల బుజ్జగించు, చె
య్యాది గొదవైన నెట్లొ సమయానుగుణమ్ముగఁ జక్కదిద్దు నా
సుదతి యలంతఁ దన్ దటియ, 'చో'ళ్లని దూఁకెడు భర్త భర్తయే? ॥

వేసవి యెండకుం దిరిగి వేసరి వేసరి ధర్మశాల కా
యాసము వాపుకో నరుగు యాచకుఁ గుక్కమొఱుంగ, నాతఁడున్
(ద్రాసమునొంది పాఱునటు దయ్యపుఁ బెండ్లము పీడ కింటికిం
బాసి చనున్మగండుఁ, బతిబాధలు వెట్టెడు భార్య భార్యయే? ॥



వేదము వేంకటకృష్ణశర్మ



# విచిత్రఘటన



శ్రీమతి బాపట్ల సుశీలగారు

అరుణకాంతులు వెదజిమ్మే చక్కని సాయం సమయం. అప్పుడే తలంటిపోసుకొని మేడమీద నిలుచుని తలవెంట్రుకలు చిక్కుదీసుకుంటున్నాను. చల్లనిగాలి మెల్లగా వీస్తూ ఆరిననాశల నీలాలను అల్లనల్లన నృత్యం చేయిస్తూంది. మందమారుతం తాకిడికి ముఖంమీద పడుతున్న కేశములు సవరించుకోవడంతో నాపని సరిపోతోంది. మనసు నిర్మల నీలాకాశంలా ఉంది. తలంటి పోసుకున్న తరువాత సంధ్యాసమయం, గాలివీవనలు కలిగించే ఆనందం ఊహించుకోవాలసిందే లేదా అనుభవించవలసిందే తప్ప, వర్ణించడం కష్టమైన విషయం.

దీనికితోడు గదిలో రేడియో మధురంగా సంగీతం- ఆలాపిస్తోంది. ఆసమయాన ఎందుకో ఏమో తెలియని ఆనందం నాహృదయంలో చెలరేగిపోతూంది. నేనేకాదు ఆలాంటి సమయం ఏమెత్తని హృదయానికైనా ఆనందాన్నిస్తుంది. ఆనాడు నాలేత హృదయమైనా ఆనంద డోలికలో ఊగులాడుతూ ఉక్కిరిబిక్కిరై పోయింది.

మాచెల్లెలు, లలిత ఎనిమిదేండ్లపిల్ల నన్ను చూచి,

"అక్కా ఇప్పుడు ఎంత బావున్నావు?" అంది.

"ఛీ! వూరుకో పిచ్చిపిల్ల" అన్నాను.

"నిజంగా అక్కా ఎంతబావున్నావు అనుకొన్నావు?" అన్నది మళ్లీ.

"లలితా; నిజంగా బాగున్నానా?" అన్నాను ప్రశ్నించకుండా వుండలేకపోయి.

"అవునక్కా బలేబాగున్నావు" అంది లలిత.

"అయితే బాగుండడం మంటే ఏమిటీ?"

"అత్త చెప్పలేదు తలంటి పోసుకుని కొత్తదుస్తులు వేసుకుంటే ఎంతోబాగుంటారని"

"ఓహో అదా విషయం?" అన్నాను.

"అక్కా నేనాడుకుంటానికి కిందకు పోతా" అంది.

"వెళ్లుమరి బజారులోకి వెళ్లకేం, కార్లువస్తాయ్" అన్నాను.

నామాట విని వినకుండానే లలిత మెట్లుదిగుతూ పరిగెత్తుకుంటూ పోయింది. చిన్నపిల్ల ఏడాది నిండలేదు మాతల్లి చనిపోయింది. అప్పటినుండి నేనే దానికి తల్లినీ అక్కను;

అద్దంముందు నిలుచుని నన్ను నేనే చూచుకుంటూ నాలో నేను మురిసిపోయాను; ఏమైనా ఎంతకాలమో ఇంకా ఈ ఏకాకిజీవితం? నాహృదయంలో కోరికలు ఎప్పుడు ఫలించడం? నాహృదయానికి ఏహృదయం జంటగాబోతుందో! అతని మనస్తత్వం ఏలాటిదో! మగవాళ్లలోకూడా చాలా తరహాల తత్వాలుగల వాళ్లుండరూ? మృదువైన హృదయం, మధుర భావాలు, సున్నితమైన మనస్తత్వం విశాల మనస్సు కలిగిఉండే వ్యక్తి నాకు లభ్యమయితే నామనోరథం ఈడేరుతుంది. అప్పుడిక నా అదృష్టమే అదృష్టం అని అనుకుంటూండగానే లలిత పరుగెత్తుకుంటూ వచ్చి-

"అక్కా! అక్కా! ఎవరో వచ్చారు" అన్నది.

"ఎవరే!" అన్నాను.

"ఏమో ఎవరో నాకేం తెలుసు" అన్నది లలిత.

"ఏరే ఎక్కడ?" అన్నాను.

"బయటే వున్నారు."

పిట్టగోడదాకా వెళ్లి క్రిందికి తొంగిచూచాను. పైజామా, గుజరాతి తరహా లాల్చీ, రేగిన క్రాఫు, అలసిపోయినట్లు కానవస్తున్న ముఖం, అయినా ఎందుకో చూడాలనిపిస్తోంది. త్వర త్వరగా క్రిందికి దిగివచ్చి తలుపు తెరిచా;

"ఇంట్లో ఎవరున్నారండీ?" అన్నాడు. చక్కని సంస్కారం ఉట్టిపడింది ఆమాటలలో.

"ఏంకావాలండీ?"

"మీనాన్నగారు వున్నారా?" అన్నాడు.

అబ్బా! ఆమాటలో ఎంతతీపి వుంది.

"లేరు; ఇప్పుడే బజారుకు వెళ్లారు" అన్నాను అదోవిధంగా.

"ఎప్పుడు వస్తారో?" అన్నాడు నిరాశభావాన్ని సూచిస్తూ.

"వచ్చేస్తారు. ఎందుకు?"

"అద్దెకిచ్చే పోర్షన్ ఖాళీగా ఉందటకదూ?"

"ఉంది, మీరెవరు. ఉద్యోగం ఎక్కడ?" అడిగాను నాన్నగారి తరఫున వకాలత పుచ్చుకున్నట్లు.

"ఇక్కడే ఉద్యోగం చేస్తున్నాను" అన్నాడు. నాప్రశ్నలన్నిటికీ ఒకటే సమాధానం మన్నట్లు.

"సరే! నాన్నగారిని అడగండి" అన్నాను, ఇక సంభాషణ ఆపాలన్నట్లు.

"మళ్లీవస్తాను. మీనాన్నగారు వస్తే చెప్పండి" అని వెళ్లిపోయాడు.

ఏవో ఆలోచనలు మనసులో అలముకుంటున్నాయి. ఎందుకో ఆనందం అధిక మవుతూంది. హృదయం పొంగిపోతూంది. సరే! ఇదేమిటి, కారణం లేకుండానే ఏమిటీ మనోవికాసం? ఏమో, ఏమిటో నాకేమీ అర్థం కాలేదు.

"కమలా!" అని నాన్నగొంతు బయటనుంచి వినవచ్చింది. అతనుకూడా వస్తున్నాడేమోనని కిటికీలోంచి తొంగిచూశా. ఊహూ; నాన్న ఒక్కరే.

"నాన్నా! నాన్నా! ఇపుడే మనయింటికి ఎవరో వచ్చిపోయారు నాన్నా" అన్నది లలిత.

"కమలా! ఎవరు వచ్చారు?" అన్నారు నాన్న.

"ఎవరో నాన్నా ఇక్కడ ఉద్యోగమట. ఇల్లు అద్దెకు కావాలని వచ్చారు."

"ఏడీ?" అన్నారు నాన్న.

"మీరువచ్చాక రమ్మని చెప్పా నాన్న."

"సరే! కావలిస్తే మళ్లీ అతడేవస్తాడు."

రాత్రి 8 గంటలకు నాన్నగారు భోజనం చేసి మేడమీద వాలుకుర్చీలో పడుకున్నారు. నేను అప్పుడే వీణమీటుతూ వున్నాను. కాని మనస్సులో వచ్చి వెళ్లిన ఆపురుషుని మెంగమే తాండవిస్తూఉంది.

ప్రతిదినము ఎంతమందిని చూడడంలేదు? ఇతని మొగమే నన్నంతగా ఆకర్షించడానికి కారణమేమి? అని నేను అనుకుంటూ ఉండగా వీధితలుపు కొట్టిన చప్పుడైనది. మా లలిత వెళ్లి తలుపుతీసింది. ఆపురుషుడే వచ్చాడు.

"లలితా! వారిని నాన్నగారి వద్దకు తీసుకొని వెళ్లు నేనూ ఇప్పుడే వస్తాను" అని వడి వడిగా తలదువ్వుకొని చీర సవరించుకొని మేడమీదికి వెళ్లి మా నాన్నగారి వెనుకను ఆపురుషుని కెదురుగా నిలబడ్డాను. అతని మొగము మరింత ఆకర్షణీయముగా కనబడినది.

"కమలా! మనం అద్దెకివ్వదలచుకొన్న భాగం వీరికొకసారి చూపించమ్మా" అన్నారు నాన్నగారు.

వారిని మేడదిగువకు తీసుకొనివెళ్లి ఇవ్వదలచుకొన్న రెండుగదులు, వంట ఇల్లు, వసారా చూపించాను. ఎలెక్ట్రిక్ దీపాలన్ని గదులకు వున్నవి.

చూపిస్తూ ఉన్నప్పుడే.

"మీ పేరండీ" అన్నాను.

"పురుషోత్తమరావు"

"మీకుటుంబమంతా ఎందరు?"

"ప్రస్తుతం నేనొక్కణ్ణే. కాని ఒకనెలలో నాభార్య చంటిబిడ్డను తీసుకొని వస్తుంది. తోడుగా మా అత్తగారు, మరదలు వస్తారనుకుంటాను. వచ్చినా వారు పదిరోజులుండి వెడతారు;"

"మీ ఉద్యోగం? - అడగవచ్చునా?"

"అయ్యోదానికేం? నేను గవర్నమెంటు కాలేజిలో హిస్టరీ లెక్చరరును. జీతం 200 లు."

"చాలా సంతోషం; మీకిదే మొదటి సంతానమా?"

"అవునండీ, నాకు వివాహమయి రెండేండ్లే అయినది, అద్దె ఎంతండి!"

"30 రూపాయలండి. దీపాలకు మూడు మూడున్నర కావచ్చు. రేడియో, టేబిల్ ఫాన్ పెట్టుకుంటె కొంచెము అధికమవుతుంది."

"బాగానే ఉంది. అడ్వాన్స్ ఇవ్వాలా?"

"మామూలే, ఒకమాసం అడ్వాన్సు 30 రూ. లు"

"మంచిది."

ఈ మాటలాడుకుంటూ మళ్లీ నాన్నగారివద్దకు వెళ్లాం. మాటలాడుతూ ఉన్నంతసేపు పురుషోత్తమరావుగారు అతి జాగ్రత్తగా చూస్తూ మాటలాడుతూ వచ్చారు. కంఠం అతిమధురంగా ఉంది. చక్కగా పాడగలవారిలాగు తోచింది.

"రేపే మంచిరోజు దిగుతాను. అడ్వాన్స్ ఇందండి" అని 30 రూపాయలు జేబులోనుంచితీసి మా నాన్నగారిచేతికిచ్చారు.

"రసీదు కావలెనా?"

"ఇద్దురుగానిలెండి. తొందరలేదు. రేపు ఉదయం 8 గంటలకు ముహూర్తం మంచిది. ప్రవేశిస్తాను." అని చెప్పి వెళ్లిపోయారు.

పెండ్లి అయినదని అతడు చెప్పగానే నా ఉత్సాహం క్రుంగిపోయింది. అయినా వారు మాయింట్లో కాపురముండాలన్న కోరిక తగ్గిపోలేదు.

పురుషోత్తమరావుగారు రాకముందే గదులు శుభ్రంగా తుడిపించి ఉంచాను. నేనూ లలితా వారి సామానులు తీర్చిదిద్దినట్లు అమర్చిపెడుతున్నాం.

“మీకెందుకండీ ఈ శ్రమ నేను నౌకరిని కుదుర్చుకున్నాను. వాడువచ్చి చేస్తాడు. సరే రానీండి” అంటూ మా పనిమేము చేశాము. సామానులలో హార్మోనియమ్, వీణ కనబడగానే వీరు సంగీతం తెలిసినవారన్న ఊహ స్థిరబడింది.



ప్రతిదినం వారు ఉదయాన్నే లేచి 6 గం॥నుండి 7½ గం॥ వరకున్ను వీణవాయిస్తూ పాడుతూ ఉంటే, నేనూలలితా సరదాగా గుమ్మం ప్రక్కను కూర్చుండే వింటూ ఉండే వాళ్లం. చనువు ఎక్కువయిన తర్వాత వారిగదిలో నికేపోయి కూర్చుండేవాళ్లం. నేనూ లలితా పాడగలమన్న సంగతి తెలియగనే, మాచేతను పాడించి స్వరంలోను లయలోను ఉన్నలోపాలు దిద్దుతూ మమ్మ హెచ్చరించేవారు పురుషోత్తమరావుగారు.

వారి యెడల పట్టరాని మోహం కలుగుతూ వచ్చింది నాకు. ఒకప్పుడు రాత్రికూడా వీణ వాయిస్తూ పాడేవారు రావుగారు. లలిత కొంత సేపటికి నిద్రపోయేది. మా నాన్నగారు మేడదిగి వచ్చేవారు కారు. మా వంటలక్క మా తల్లిపోయినప్పటినుండీ తల్లివలె పెద్దదిక్కుగా ఉండేది. ఆమె ప్రక్కనే నేనూ లలితా పడుకునేవారం.

“10½ గం॥ల రాత్రి అయింది. ఇకవచ్చి పడుకో కమలా!” అనేది మా వంటలక్క రమణమ్మ.

“నువ్వుపడుకో రమణమ్మా నీకు నిద్రవస్తే” అనేదానను.

ఆమె ఏమో గొణుగుకుంటూ పడుకొనేది. పురుషోత్తమరావుగారుకూడా వీణ క్రిందపెట్టి, “ఇక పడుకోండి” అనేవారు. నాబలవంతాన మరియొకపాటపాడి ముగించేవారు.

ఇలా ఒక నెల గడచింది. నా హృదయంలో వింత వింత భావాలు పుట్టుకొని వస్తున్నాయి. రావుగారిని చూచినకొద్దీ ఆదరం అనురాగం గౌరవం ఎక్కువగుతున్నవి. మోహం మాత్రము తగ్గింది. కాని పూర్తిగాపోలేదు. నామాటలలోను చూపులలోను నాహృదయభావం వారికి అందజేశానేమో కూడాను. కాని రావుగారు మాత్రము నాచిన్న చెల్లెలు ఎనిమిదేండ్ల పిల్లను - లలితను ఎట్లు చూచారో అట్లే నన్నూ చూస్తూ వచ్చారు. స్వేచ్ఛగానే కులాసాగానే మాట్లాడేవారు. కాని నేను ఆశించే భావంతో ఎన్నడూ మాట్లాడలేదు.

ఒకనాడు, "కమలాదేవిగారూ!" అంటూ రావుగారు తన భార్య నాకు వ్రాసిన ఉత్తరం నాచేతికిచ్చారు. విప్పి చూచాను. "వదినగారికి నమస్కారములు. మీ అన్నగారు మీ ఆదరం సుగుణ సంపత్తి అంతా తెలియజేశారు. మిమ్మలిని ఎప్పుడు చూస్తానా అని ఉవ్విళ్ళూరుతున్నాను. వచ్చేవారం దశమినాడు బయలుదేరి వస్తున్నాను" అని ఉన్నది.

ఆ లేఖ చూడగానే పైకి ఆనందిస్తూ ఉన్నట్లు మొగంపెట్టి నవ్వుతూ, "బాగుంది" అన్నానుగాని లోలోపల మాత్రం పట్టరాని ఆవేదన పొందాను. కుమిలిపోయాను. వెంటనే ఏదోపని ఉన్నట్లు నటించి గదిలోకిపోయి తలుపు బిడాయించి, ఏడ్చాను. ఓదార్చుకొన్నాను; బోధపరుచుకొన్నాను.

రావుగారిభార్య రాజ్యలక్ష్మీదేవిగారు చంటిబిడ్డ నెత్తుకొని వచ్చారు. ఆమెతో ఆమె అన్నగారు రామారావుగారు వచ్చారు. ఇంట్లో అంతా సందడిగా ఉన్నది. రామారావుగారు అప్పుడే బి. ఎ అయి, ఉద్యోగం సంపాదించుకోడంకోసం మద్రాసు వచ్చారు.

వచ్చిన వారంరోజులలోనే బ్యాంకులో ఉద్యోగం దొరికింది. స్ఫురద్రూపి, మితభాషి, నాతో చెప్పకుండానే అతనికి నామీద ప్రేమ పుట్టిస్తున్నారు రావుగారున్నూ, రాజ్యలక్ష్మీదేవిగారున్నూ.

ఒకనాడు మానాన్నగారు మేడమీద లేనిసమయంలో పురుషోత్తమరావుగారు నన్ను మేడమీదికి రమ్మని పిలిచి, "కమలాదేవీ! నేను నిన్ను సోదరిగా భావించి ఒక విషయం చెప్తాను. మరియొకలాగున భావించకవిను. నీసుగుణసంపత్తి - అందులో నీ సౌహార్దము బాగుగా గుర్తించాను. నీ దౌర్బల్యముకూడా నేను గుర్తించకపోలేదు. నేనుకూడా ఆ దౌర్బల్యానికి లోబడియుంటే, మనఇద్దరి జీవితాలున్నూ పాడయి పోవును. నాభార్య సోదరుడు మంచి తెలివితేటలుగలవాడు, అందమయినవాడు. అతనికి నిన్ను వివాహం చేసుకోవాలనివుంది. నీకిష్టమయితే మీనాన్నగారితో చెప్తాను" అన్నారు రావుగారు.

నేను మారుమాటాడలేకపోయాను. "రావుగారూ! నామనసు స్థిరపరచుకోలేకుండా ఉన్నాను. రేపు చెప్తాను. అంతవరకు ఆలోచించుకోడానికి అవకాశమీయండి" అన్నాను.

"అలాగేనమ్మా" అన్నారు.

ఆ మరునాడు నేను రావుగారిని మేడమీదికి తీసుకొనిపోయి, "మీరు నాకు చేసినమేలు ఇంతంత కాదు. నేను సరిగా చెప్పలేకుండా ఉన్నాను. నాశీలం చెడిపోకుండా కాపాడారు. కాపాడుకోడానికి అవకాశం ఇచ్చారు. కోరికోరనట్లు ఫలమందించారు. నాకు వాస్తవంగా మీరు సోదరులు. నా యెడల మీకుగల ఈ సౌభ్రాత్రం, సద్భావం కలకాలం నిలపండి" అన్నాను.

అంతా విజయవంతంగా, శుభప్రదంగా జరిగింది. ఇదియొక విచిత్రఘటన.

---o---

# సోవియట్ దేశంలో కుటుంబం, వైవాహిక చట్టాలు

కుటుంబ సంబంధాలకు చెందిన సోవియట్ చట్టాలు సోవియట్ రాజ్యాంగంలోని 122 వ సూత్రం మీద ఆధారపడివున్నాయి; ఈ సూత్రం పురుషులతోబాటు స్త్రీలకు రాజకీయ, ప్రభుత్వ, సాంస్కృతిక తదితర రంగాలన్నిటిలోనూ సమాన హక్కులిచ్చింది; మాతాశిశువులకు ప్రభుత్వరక్షణను నెలకొల్పింది.

## స్థిరమైన కుటుంబ బంధాలు

స్థిరమైన, బలమైన కుటుంబబంధాలు సోవియట్ సమాజానికి చాలప్రధానమైనవి. ఈ బంధాలను కాపాడడమూ బలపర్చడం సోవియట్ న్యాయచట్టాల లక్ష్యం. సోవియట్ దేశంలో తల్లి సర్వజనీనమైన గౌరవాభిమానాలను చూరగొంటుంది; న్యాయశాస్త్రం ఆమె హక్కులను కాపాడుతుంది.

సోవియట్ దేశంలో కుటుంబసంబంధాలు, ముఖ్యంగా, భార్యా భర్తల పరస్పరప్రేమ, గౌరవాభిమానాలమీదనే ఆధారపడి వుంటాయి.

వర్గసమాజంలో ద్రవ్యాశప్రధానమైన వివాహాలవంటివి (అంటే స్వప్రయోజనానికీ, డబ్బుకీ, జరిగే వివాహాలవంటివి) సోవియట్ దేశంలో కనబడవు. ఈదేశంలో వివాహానికీ, కుటుంబానికీ, పిల్లల రక్షణకీ సంబంధించిన న్యాయశాస్త్రం ముందు స్త్రీపురుషులేవిధంగా సమానులో అలాగే వైవాహిక విషయంలోకూడా సమానులు.

## స్త్రీపురుషుల సమానత్వం

సోవియట్ కుటుంబ, వైవాహికచట్టాల రీత్యా స్త్రీ పురుషులు సమానులు. వధూవరులు వొకేయింటి పేరుతో వుండవచ్చును. (భర్తయింటిపేరుతోగాని భార్యయింటిపేరుతోగాని) లేదా వారివారి స్వంత యింటిపేర్లు వుంచుకోవచ్చును. అవిధంగా వారుగాని వేరువేరుగా తమ స్వంతయింటిపేర్లనే వుంచుకుంటే పిల్లల ఇంటిపేర్లు భార్యాభర్తల పరస్పరాంగీకారంమీద నిర్ణయింపబడతాయి; అంతేకాని భర్త తన నిర్ణయాన్ని బలవంతంగా భార్యమీద రుద్దటంవల్లమాత్రం కాదు. ఎవరింట్లో నివశించడమనే విషయాన్ని నిర్ణయించుకోవడంలో కూడా చట్టరీత్యా భార్యాభర్తలిద్దరికీ పూర్తిసమానత్వం, స్వాతంత్ర్యంవుంది. వృత్తి, వుద్యోగాలను ఎంచుకోవడంలోకూడా భార్యాభర్తలిద్దరికీ పూర్తిస్వేచ్ఛవుంది. కుటుంబవ్యవహారాలన్నీ దంపతుల పరస్పరాంగీకారంమీదనే జరుగుతాయి.

## పిల్లల రక్షణ

పిల్లల శ్రేయస్సును ప్రభుత్వమే రక్షించేటట్టు నిర్దేశించే సోవియట్ రాజ్యాంగంలోని 122 వ సూత్రాన్ననుసరించి పిల్లలకూ తల్లిదండ్రులకూ మధ్యగల సంబంధాలకు చెందిన చట్టాలు పిల్లలశ్రేయస్సును దృష్టిలోపెట్టుకొని తయారు చేయబడ్డాయి. పిల్లలకు సంబంధించిన నిర్ణయాలన్నీ తల్లితండ్రులు వుమ్మడిగా తీసుకుంటారు. ఇద్దరిమధ్య సమాధానం కుదరనప్పుడు పిల్లల పెంపకానికి బాధ్యత తీసుకునే సంస్థలు (గార్డియన్‌షిప్ సంస్థలు) తల్లిదండ్రులతోకలసి వ్యవహారాన్ని చక్కబెడతాయి. యుక్తవయసు వచ్చేవరకూ పిల్లల్ని పెంచడంలో, ముఖ్యంగా, సమాజానికి ప్రయోజనకరంగా వారినితర్ఫీదు చెయ్యడంలో తల్లిదండ్రులిద్దరూ బాధ్యతవహించాలి. పిల్లలకీ తల్లిదండ్రులకీ మధ్యగల సంబంధాలవిషయంలో చట్టరీత్యా తండ్రికి ప్రత్యేక హక్కులేవీలేవు. పిల్లలపట్ల తల్లిదండ్రులిద్దరికీ సమానహక్కులుంటాయి.

## స్త్రీలకు పూర్తి ఆస్తిహక్కులు

తన స్వంతఆస్తిని నిర్వహించుకోవడంలోనూ, అమ్ముకోవడంలోనూ, వ్రాసియివ్వడంలోనూ స్త్రీకి గల పూర్తిహక్కులూ, భార్యాభర్తల సమానత్వమూ వివాహం, కుటుంబం గార్డియన్‌షిప్‌లకు సంబంధించిన చట్టాలలోని ఆస్తివిషయాలకు చెందిన సూత్రాలలో వ్యక్తంచెయ్యబడ్డాయి. వివాహానికిపూర్వం స్త్రీకిగాని పురుషుడికిగాని ఆస్తివుంటే వివాహానంతరం అది వారివారి స్వంతఆస్తిగానే వుంటుంది. భర్తయిష్టాయిష్టాల ప్రసక్తిలేకుండా భార్య తనఆస్తిని అమ్మకోవడంగాని, వ్రాసియివ్వడంగాని, చెయ్యవచ్చును. వివాహమైనతర్వాత ఆర్జించినఆస్తి భార్యాభర్తల వుమ్మడిఆస్తిగా నుంటుంది. ఆస్తివిషయంలో తగాదా వస్తే కోర్టుద్వారా పంపకాలు జరుగుతాయి, కోర్టువారు ఆస్తిని సమానంగా యిద్దరికీ పంచుతారు. కాని పరిస్థితులననుసరించి ఒకరికి హెచ్చుగానూ, రెండోవారికి తక్కువగానూ, (అంటే ఉదాహరణకి, పిల్లలు ఎవరిదగ్గరుంటే వారికి హెచ్చుగా) లభిస్తుంది. స్వంతంగావాడుకునే వస్తువులుమాత్రం పంపకంకావు.

భార్యాభర్తలు తమఆస్తివిషయంలో ఒకరితోనొకరు వొడంబడికలు చేసుకోవచ్చును. కాని భర్తయొక్కగాని భార్యయొక్కగాని ఆస్తిహక్కులకు భంగకరమైన వొడంబడికమాత్రం పనికిరాదు; అటువంటి వొడంబడికను మూడవ పార్టీవారుగాని, భార్యగాని, భర్తగాని పాటించవలసిన బాధ్యతలేదు; ఎప్పుడైనాసరే దాన్నివారు తృణీకరించవచ్చును.

న్యాయశాస్త్ర విషయాలలో సోవియట్ స్త్రీలకు (వివాహితులైనాసరే కాకపోయినాసరే) పూర్తి అర్హతవుంది. సివిల్‌కోడ్ 4 వ సూత్రం ప్రకారం, కోర్టువారిచే శిక్షింపబడి యీ అర్హతను పోగొట్టుకున్నవాళ్లు తప్ప, పౌరులందరికీ పౌర అర్హతవుంది. పౌర అర్హతకు సెక్సు, తెగ, జాతి మత వంశ విషయాలలో ప్రసక్తిలేదు. స్త్రీల అర్హతను భంగపరిచే వొడంబడిక ఏదైనా విలువలేనిదవుతుంది. పురుషులవలెనే స్త్రీలుకూడా యీ హక్కును కోర్టుమూలంగా కాపాడుకోవచ్చును.

### బాగా ఆలోచించిన తర్వాతే విడాకులు

వివాహం, కుటుంబం, గార్డియన్‌షిప్‌లకు చెందిన చట్టంప్రకారం భార్యాభర్తలలో ఒకరు అశక్తులైనప్పుడు రెండవవారు వారికి ఆర్థికంగా సహాయపడాలి; మనోవర్తిహక్కులూ, బాధ్యతలూ భార్యాభర్తలిద్దరికీ సమానంగానుంటాయి. విడాకులకూ, పునర్వివాహానికీ సంబంధించినచట్టంలో స్త్రీల హక్కులను భంగపరిచే సూత్రంగాని, వారిసమానత్వాన్ని దెబ్బకొట్టేసూత్రంగాని కనబడదు.

దంపతుల్లో ఏ వొక్కరుగానీ, యిద్దరూగానీ పెట్టుకున్న దావామీద కోర్టువారు తీర్పుయిస్తే వివాహబంధం రద్దవుతుంది. దావాకుగల కారణాలేమిటో కోర్టునిర్ధారణచేసి, దంపతులను సమాధానపర్చే ప్రయత్నాలన్నీ విఫలమయితే, వివాహబంధాన్ని రద్దుచేయడానికి కారణాలు తగినంతబలంగా వున్నాయోలేదో నిర్ణయిస్తుంది. వివాహబంధాన్ని రద్దుచెయ్యడం అవసరమని కోర్టువారుభావిస్తే, పిల్లల జీవనాధారానికీ తల్లిదండ్రులివ్వవలసిన వంతులను నిర్ణయిస్తారు. విడాకులతో తెగదెంపులయేటప్పుడు పిల్లలు తల్లిపోషణకిందకు వెళ్తారు. చట్టరీత్యా పిల్లలశ్రేయస్సుకు తల్లిసరియైన సంరక్షకురాలు.

ఒక వివాహబంధం రద్దయినతరవాత స్త్రీ పురుషులిద్దరూ మళ్లీ పెళ్లిళ్లు చేసుకోవచ్చును.

కుటుంబం బాగా కలసిమెలసి స్థిరంగా వుండడానికి అవసరమైన పరిస్థితులను సోవియట్ న్యాయశాస్త్రం సృష్టిస్తుంది.

'టాస్' నుండి

——(:o:)——

# దీనిలో తప్పెవరిది?



శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రిగారు

అయ్యో! పాడుదైవమా! నన్నిట్లు బాధించుచున్నావే. నే నెట్టిపాపము చేసితిని. సన్న్యాసమున్నగు నితరాశ్రమములలో నుండువా రెట్టి యిహలోక సుఖము గృహస్థు డనుభవించుచుండునని యూహించుచున్నారో అట్టి యైహిక సౌఖ్యము, పెండ్లియైనది మొదలు లేశమైనను ననుభవింపక పోతిని గదా! తక్కినయాశ్రమములవారు సంతానము కనుటకు వీలులేదు కనుక అన్నియాశ్రమములవారికిని గృహస్థుడే కారణము కావున నతడే యన్నియాశ్రమముల వారిలోను ఉత్తముడు. (తేషాం గృహస్థో యోని రప్రజనత్వాదితరేషాం) అని సూత్రించిన మహర్షి యెవ్వరో కాని, అతడీసూత్రమును గృహస్థులను పరిహసించుటకే వ్రాసినట్లున్నది. "గృహస్థధర్మము చాల సంకటమైనది (సంకటా బహ్వపత్యానాం ప్రత్యవాయై గృహస్థతా)" వ్రాసిన కవీశ్వరుడెవ్వరో ఆయనమాత్రము నిజము మాటాడినాడు.

"ఋణానుబంధరూపేణ పశుపత్నీసుతాదయః" అను నీలోకప్రవాదముమాత్రము నిజమైనది సుమా! బొంతయు, కపాలమును దమసర్వస్వముగా నెంచుకొనుచు ఏ వాంఛయు లేక తిరుగుచుండు నా మహాత్ములగు యోగీశ్వరులే ధన్యులు. ఓహో ఏమి పాపపరిణామము? చిన్నప్పటినుండి నేర్చుకొనుచున్నను పాకకళ స్వరూపము నీకు గోచరింపలేదుకదా! నీవంటిదానిని నాకు సహధర్మచారిణినిగా గూర్చిన దైవహతకుడు నిజముగా నాయెడ దనకోపము నంతయు బ్రదర్శించినాడుగదా! దీనికి అంతు ఎప్పటికి? దీని కేమేని హద్దైనను గలదా? ఇక నా యీ జీవితశేషమును గడపుట చాలా కష్టము." అని యిట్టి యమంగళ వాక్యములు బలుకుచు, నేను తఱచుగా తిట్టుటలో గల నైపుణ్యము నంతయును సంపూర్ణముగా బ్రదర్శించితిని.

సూర్యుడు నెత్తిమీదకు రాగా, ఎండచే తపింపజేయబడిన గువ్వల వలె అలసిపోయిన కాలుసేతులుగల నా పిల్లలందఱును ఆకలి తీర్చుకొనుటకు తొందరపడుచు, బుజ్జగింపదగినట్లుగా, ఆ సమయమునకు దగిన బాల్యచాపల్యము చూపుచు, వచ్చి చిత్తరువున వ్రాయబడిన బొమ్మలవలె చపలచేష్టల నన్నిటిని విడిచిపెట్టి క్షణకాలము వఱకు నావంకకే చూచుచు నిలువబడిరి.

నేను సంధ్యావందనమును పూర్తిచేసి కూర్చుండులోపల స్థలము పరిశుద్ధి చేసి విస్తరి వేయబడినది. అన్నము వడ్డింపబడెను. చేతితో కప్పివైచిన కప్పుదగినంత వెడల్పు

గల అరటియాకునందు చేయి యుంచి, నేతితో దడిసిన వేడియన్నముతో ప్రాణాహుతులు వేసికొని, ఆకలిదయ్యమును పూజించుటకుఁ బ్రారంభించితిని. మొదటిముద్దను మ్రింగి యేదో పాకదోషముచేత నాలుక చెడను వెనుక జెప్పినరీతిగా మాట్లాడితిని. చిన్నప్పటినుండి పేదయింటఁ బెరిగిన నేను ఈ పాకదోష మేదియో యని యాలోచించియుఁ దెలిసికొనఁ జాలకపోయితిని. అట్టి పాకదోషమును వివరముగాఁ దెలిసికొనఁ జాలని నావంటి మిత్రులు కొందఱుందురుగాన ఈ విషయమున నభిప్రాయభేద ముండదని తలంచుచున్నాను. రెండేసి యేండ్ల వయస్తార తమ్యముగల నా పిల్లలందఱును, కఠినముగా మాటాడుచున్న నన్ను జూచి తమతమ యీడునకు దగినట్లుగా చేష్టలతో నస్పష్టముగా అభిప్రాయములను వెలిబుచ్చిరి. పదియేండ్ల యీడుగల పెద్దపిల్ల "ఏమిటి నాన్న యిట్లు పామరునివలె తనకు దగని మాటలను చెడుగా మాటాడుచున్నాడు" అని యనుచున్నట్లుగా, నా యందేదో అసహ్యాభావమును తల్లియందు కరుణను, పరితాపమును ముఖమునందు మారుచున్న రంగులతో సూచించెను. పిల్లవాఁడొకడు తీక్ష్ణమైన నాదృష్టిలో నుండ నిచ్చగింపక కాబోలు తలవంచికొని, దైన్యముతోఁ జూచుచున్న తల్లివంకకు సాభిప్రాయముగాఁ జూచుచును, మఱియొక కుఱ్ఱవాడు అదరుచున్న పెదిమలతోను, చెక్కిళ్లను నల్లబఱచుచున్న కన్నీటిధారతోను ఆ యా భావములను బ్రకటించిరి.

ఇఁక నాభార్య మొగముననో, నిలుకడలేని చూపును, దీర్ఘము గు నిట్టూర్పును, కాలిబొటనవ్రేలిని తడుపుచున్న కన్నీటిధారయు, కొంచె మూహించుటకు వీలగు కనుబొమల ముడిపాటును ఒకదానినొకటి మించక సమానముగా నుండినవి.

ఆమె మాటలాడకూఱకుండుట నన్ను మఱింత పెచ్చుపెరుగునట్లొనర్చి మిక్కిలిగా వాగించినది. "నిన్ను నిందించి యేమి ప్రయోజనము? నీ తలిదండ్రులు, ఎవనిను పెండ్లాడుటకు పనికిరాని నిన్ను శూలమునకు దగినవాడు శ్రేష్ఠియే" యన్నట్లు నా మెడకు గట్టి నన్నిట్టి దుస్తరమగు సంసారనరకములో బడవేసినారు. వారి ననిమాత్ర మేమి ప్రయోజనము? ఆడుపిల్ల నెవరికో యొకరికి మెడగట్టుట తలిదండ్రులస్వభావముకదా! ఎవడో యొకడు తగినవాడు దొఱకిన వారిపుణ్యము పండినట్లే

లెక్కపెట్టి వరదక్షిణ గలగల రాల్చ నక్కరలేదు. వధూవరుల కిద్దరికి నీయవలసిన ద్రవ్యమా - యీయ నక్కరలేదు. ఏడాదిలోపల తీసుకొనివచ్చి అల్లునికి చేయవలసిన సత్కారమా - అసలే లేదు. కార్యమునాఁడైనను గౌరవించి చేయవలసిన సత్కారవిశేషమా - అక్కఱలేదు. సీమంతోత్సవ సందర్భముననేని మిక్కుటముగా జేయవలసిన సన్మానాతిశయమా - అదియు లేదు. ఇట్టి సమయములందేకదా అల్లుండ్రు

ఇచ్చువచ్చినంత ధనము లాగికొని తమ మామగార్ల ధనపుపెట్టెలను ఖాళీచేయుచుందురు? అట్టి వేవియును మనకు లేవుకదా! పోనీ మంచిస్వభావమా లేదు. రూపశోభాసంపదయా మున్నే లేదు. అత్యుత్తమవంశమందుమా అదియును నంతగాఁ జెప్పఁదగదు. విద్యాసంస్కారము చూతమా - నీకును దానికిని చాల దూరము. ఇట్టియెడ నీయందు కుటుంబనిర్వహణశక్తి యేమికలదని మా తల్లిదండ్రులుచూచి నాకు నిన్ను పెండ్లిచేసినారో తెలియకున్నది. మిత్రుల మాటల త్రోసివేసి, పెద్దల యుపదేశమును తిరస్కరించి కొడుకునైన నా యభిప్రాయమును లెక్కయే చేయక, విఘ్నముల నేమాత్రమును గణింపక, తమ యభిమానమునుగూడ చంపుకొని మావంశముయొక్క గౌరవసాంప్రదాయములనుగూడ శిథిల మొనర్చి నిన్ను నాకు పెండ్లిచేసిన ఆ నాతల్లిదండ్రులకు తృప్తి కలిగిన కలుగునుగాక, కాని నీవలన నాకు మాత్రము తృప్తి యేర్పడదు.

భార్య అనుకూలురాలగుట, ఎంతో గొప్పపుణ్య మొనర్చినవారికి, గాని అందరికి లభించునా? అట్లే ప్రతికూలురాలగుటయు నెంతో పాపమునకు ఫలము. నిన్ను పెండ్లాడినందున నింత రుచిగా భుజించుటకుఁ గూడ వీలులేకున్నదే! ఇంతకంటె పాప మేమున్నది? నీ వంట యెవఁడు తినును? కుక్కకుఁగూడ రుచింపదు. ఈ పండ్రెండేండ్లనుండి నా యింటనుండియు భర్తకేది యిష్టమైనదో తెలిసికొనజాలకపోతివి. అట్టిస్థితిలో నింతకంటె నేను కోరునదేమి యుండును? తిండియే సరిలేనప్పుడు ఇంతకంటె నాయభీష్టమును నీవేమి తీర్చెదవు? గృహస్థధర్మ మిఁకఁ జాలును. పనులలో నేర్పరియై, తన కనుకూలురాలగు భార్య లభించినవాఁడే గృహస్థుఁడు. కాక నాబోంట్లందఱునా? అని మఱల తిట్లగ్రంథములో రెండవ యధ్యాయమును బాడితిని.

ఈ నిందాగ్రంథమును నంతయు వినినను మాయింటావిడనోటినుండి యొక్క మాటయైనను వెలువడకుండుటచే "భర్త యెన్ని కఠినోక్తులాడినను నే వనితమనస్సు నొచ్చుకొనలేదో, తిరుగుజవాబు చెప్పదో, జవాబు చెప్పుటకుఁగూడ పూనుకొనదో, మెల్లగా గొణుగుచు భర్తమనమును కష్టపెట్టదో ఆవిడయే సరియైన భార్య" అని యావిడయందునాకు సద్భావముగలిగి వృద్ధి కాఁజొచ్చెను. కాని ఆవిడ యూఱకొన్నకొలదియు నాకోపముగూడ పెరుగజొచ్చెను. ఎన్నఁడో మంగలిముఖముచూచిన నాకీ సమయమున గగుర్పాటుగలుగుటయు, దానితోబాటు చెమటలుపోయుటయుఁ దటస్థించి యేదో బాధను గల్గించినవి. ఇట్టి దురవస్థలోనున్న నాతలయు గిరగిర తిరిగినట్లుండి యేమియు కులాసా లేకయ్యెను. ఆవిడతల్లిని, తండ్రిని, తల్లితరపువారిని, తండ్రివంశములోనివారిని ఎఱిగినంతవఱకు కఠినోక్తులతో దూషించి భాష చాలనందున తిట్టుటను

మానితినే, కాని ఓర్పు చేతగాని ఆమెను క్షమించి కాని యూరకుండలేదు సుమా! ఇట్లూరకుండి భోజనము నెట్లో ముగించి చూతునుగదా పిల్లలందఱును భోజనముచేసి బడికి వెళ్లుచు కన్పించినారు.

నేనుగూడ కచ్చేరికి వెళ్లవలయును. సూర్యుడా? ఆకాశమధ్యమునకు వచ్చుచున్నాడు. ఇంక విశ్రమించుటకుం గూడ నవకాశము లేదు. ఇంక తిట్టుటకిది సమయము గాదు. పనివేళ మించుచున్నది అని మిక్కిలి తొందరతో చొక్కాల బంకెనుండి చొక్కాను తీసి తొడుగుకొని త్వరగా బయలుదేరితిని. ఇంతలో మెల్లగా వచ్చి తలుపు పట్టుకొని నిలుచబడిన మా యింటావిడ నోటినుండి "సాయంకాలము కచ్చేరినుండి తిరిగి వచ్చునపుడు వీలున్నచో, డబ్బున్నచో ఉప్పును కొనితెండు" అనుమాట వెలువడెను. ఈమాట, నేనింతవఱకును జూపిన కోపమున కంతకును జవాబుగా నా చెవులలో మార్మ్రోగినది. చాలసేపాలోచించి, "ఉప్పులేకపోవుటచే గలిగిన పాకదోషము కాని యిది మా ఆడువాండ్రది కాదు, ఆవిడతల్లిదండ్రులది కాని, నాతల్లిదండ్రులది కాని తప్పు కాద"ని తెలిసికొంటిని.

పాఠకమహాశయులీ తప్పెవరిదో తమలో దాము మెల్లగా నాలోచించి చెప్పుడు.

——(o)——

# వరశుల్కము



శ్రీమతి క. పద్మావతీదేవి.

(గత సంచిక తరువాయి)

అతడిది, వసని తండ్రిగారగు వీరావధానుల కడనుండి వచ్చిన తంతియనియు, అందు తన కుమారునికీ సంవత్సరము వివాహము చేసికొనుట కిష్టము లేదనియు, అందుచే వివాహము లేదనియు వ్రాసియుండెనని కృష్ణయ్య కాయువకుడు చెప్పెను.

ఆమాటలు వినుట తోడనే కృష్ణయ్య నిర్ఘాంతపోయి యేమియుతోచక నొకయరగంటవరకు మాటలాడలేకుండి కొంతసేపటికిలేచి లోనికిజని యాతని భార్యతో నిదిచెల్ప నందరు నిర్ఘాంతపోయిరి. అప్పుడక్కడి జనులందరు వారిలోవారు, "వీరావధానులవిద్య తగులబెట్టనా? ఆతడిన్నిసార్లు కృష్ణయ్యగారిని బాధించుట తగునా. ఇష్టములేనివాడు మొదటనే తెల్పరాదా? ఈసమయమందు కృష్ణయ్యగారు పడు క్షోభయంతయు వీరావధానులుగారికి తగులదా? దగాకోరు వెధవలు కావలసినంత కట్నము తీసుకొని పైగా వివాహపు ఖర్చుల కొఱకేడ్చి యింకొక సంబంధము వచ్చినదని యుత్తరము వ్రాయగా పాపము కృష్ణయ్యగారు పెళ్ళిఖర్చులుగూడ వహించెదనని చెప్పగా నొప్పుకొని తిరుగా నిట్లు తంతివార్తనిత్తురా" యని వారిలో వారు వీరావధానులను, బి. ఏ. చదివిన యతనికుమారుని కీమాత్రము జ్ఞానములేక పోయెనా యని యాతని కుమారుని నోటికివచ్చినట్లెల్ల దిట్టుచుండిరి.

పాపము కృష్ణయ్యగారికేమియు దోచుటలేదు. కుమార్తె వివాహము నెంతమాత్రము అపుటకు వీలులేదు. వివాహ ప్రయత్నములన్నియు చేయబడినవి. బంధుగులందరు వచ్చిరి. ఇప్పటికే సంబంధము దొరకక, దొరికియు కూడ పడరానిపాట్లుపడెనే. ఇట్టిస్థితిలో నీదినమున, నీసమయమందు కృష్ణయ్య మనస్సెట్లుండునో కృష్ణయ్యవంటి కన్యలు గల్గినవారికే యెరుకగాని వేలకొలది రూప్యములను తమ కడుపున పుట్టిన పుత్రుల మాంసము నమ్ముచు, కన్యలుగలవారి రక్తమును బిండుచు, గొంతెమ్మకోర్కెల గోరెడివారికేమి యెఱుక? ఏమైననుసరియే యని కృష్ణయ్య "ఛీ! యిట్టి యర్థమూర్ఘుని యొద్దకు మరల బోగూడద"ని తలచి సర్వమునకు భగవంతునదే భారమని యప్పటి కూరకుండెను.

## 3

శ్రీరామమూర్తియనియు, రామచంద్రుడనియు, రెండునామములనితని తనగ్రామములోనివారు పిలచెదరు. ఎఱ్ఱనిచాయగల మేనివాడు. విశాలమగు వక్షస్థలము, విశాలములగు నేత్రములు, పొడవైన బాహువులుగలవాడు; దీనులయందు ప్రేమమపారము. అసహాయులగు నితరులను చేతనైనసహాయము చేయువాడు. కడుబుద్ధి కుశలతగలవాడు. మాతృభాషయం దభిమానమెక్కువ. వయస్సు పదునెనిమిదిసంవత్సరములు. సాలునకు పదునైదువందలరూప్యము లాదాయమువచ్చువాడు. వాసుదేవశాస్త్రిగారికి ఏకపుత్రుడు. వార్తాపత్రికలు నిరంతరము చదువుచుండును. ఇంటరుమీడియేట్ తరగతియందుచదువుచు గాంధిమహాత్ముని బోధవిని చదువుమాని రాట్నమేశరణ్యమని రాట్నము ద్రిప్పుచుండును. ఖద్దరుగట్టుటయందు మిక్కిలి యిష్టము గలవాడు.

రామచంద్రునికి పండ్రెండవ సంవత్సరము రాకుండగనే నాలుగైదువేలవరకు కట్నమిచ్చెదమని వచ్చుచుండిరిగాని, తండ్రి రామచంద్రునికి పదునెనిమిదివత్సరములు వచ్చువరకు వివాహముచేయనని పల్కుటచే వెడలిపోవుచుండిరి.

కృష్ణయ్యగారిబుద్ధి రామచంద్రమూర్తిమీద నుండెను. కట్నమివ్వలేక కృష్ణయ్యగారి సంబంధము కొరకు ప్రయత్నించలేదని యిదివరకే తెల్పియుంటిమి. కృష్ణయ్యగారు తమ స్వల్పాదాయముతో తమ ముగ్గురుకుమార్తెలకు వివాహముచేయుటయందు పడెడు బాధలచూచి రామచంద్రుడు మిక్కిలి జాలిపడుచుండును. వార్తాపత్రికలలో నొకదినమున వరశుల్కములను గూర్చినవ్యాసమును జదివి యీవరకట్నము అన్నిజాతులయందును సామాన్య సంసారముల నెట్లు గుల్లచేయుచున్నదనియు జూచి తనలో తాను కట్నముదీసుకొనగూడదనియు నిశ్చయించుకొనెను. మఱియు కట్నము దీసుకొను నితరులకుగూడ వరకట్నమున పుత్రులను బానిసలవలె పరులకమ్ముకొనుట యనియు, కట్నములవల్ల దేశమునెన్నివిధముల పాడగుచున్నదో యివియన్నియు ప్రజలకు దెలియజెప్పుచు కట్నముబుమాన్పుటకు ప్రయత్నించుచుండును. మనదేశములోనే ఏనాయకులును, యేపత్రికలును, ఏపండితులును, ఈదేశమందు పుట్టిన నిట్టిఘోరమగు సాంఘికదురాచారమును చీడను నశింపచేయుటకు కలుగజేసికొనకయున్నందులకు మిగుల వగచుచుండువాడు.

తండ్రి వాసుదేవశాస్త్రిగారు, వీరావధానుల వంటివారుగారు. ఆయన జాలిగల హృదయముగలవాడు. సద్వంశములోనివాడు. పేరుకీర్తులుగలవాడు. ఏకపుత్రుడగుటచే రామచంద్రమూర్తి ఎట్లుచెప్పిన నట్లువినుచుండును. రామచంద్రమూర్తికి కృష్ణయ్యగారికుమార్తె సుశీలయందనురాగ మెక్కువ. ఆమె ఖద్దరుయందును, చరకాయందును జూపుప్రేమ రామచంద్రునికి సంతసము గొలుపుచుండెను. కృష్ణయ్యగారు నేటివఱకు సుశీలవివాహమునకై పడినపాట్లు యెప్పటికప్పుడు తనతండ్రికి నివేదించును. నేడు కృష్ణయ్యగారికివచ్చిన తంతివార్త సంగతిగూడదెల్పి "నాయనా! యీయన కట్నములివ్వలేకను, యిచ్చుచుగూడ నిట్లుబాధపడుట నేను చూడజాలను గనుక నేను సుశీలను వివాహమాడెద"నని తండ్రితో తెల్ప వాసుదేవశాస్త్రిగారు "మంచిది నాయనా, నీమాటకునేను వెనుదీతునా సరేకానిమ్ము"ని ఒప్పుకొని కృష్ణయ్యగారికి కబురుచేసెను. కృష్ణయ్య "ఏమి మాయదృష్ట"మని యుప్పొంగెను. అతని బంధుగులయొక్కయు, భార్యయొక్కయు, సంతోషమునకు మేరలేకుండెను. సుశీల సంతోషాబ్ధి నోలలాడుచుండెను. వేలకువేలు కట్నమిచ్చెదనని వచ్చువారిని వదలి, సుశీలకొఱకు పలు కష్టములకులోనై భగవంతునిమీద భారము వేసుకొనియున్న కృష్ణయ్యగారి కుమార్తెను రామచంద్రుడు వివాహమాడ నున్నందులకు ప్రజలందరు వారిని పొగడిరి. ఒక్కదినముననే వాసుదేవశాస్త్రిగారికికూడ సన్నాహములన్నియు పూర్తికాగా కృష్ణయ్యగారి బంధుగులందరు వెడలకుండగనే, ఆ ముహూర్తముననే మాఘశుద్ధ పంచమిరోజున గాఢానురాగముగల రామచంద్రమూర్తికిని, సుశీలకును, కట్నమేమియులేక మహావైభవమున పెండ్లియయ్యెను. ఆహా! వరకట్నమను దురాచారము మాన్పుటకు శ్రీరామచంద్రమూర్తియే మార్గదర్శకుడు కావలెగదా యని ప్రజలాతని పలువిధముల శ్లాఘించిరి.

—o—




తంగేడు:—తంగేడువేరు. ఆకులు, పువ్వులు, చెక్క, విత్తనములు పలువిధ ఔషధములకు సులువుగ నుపయోగపడును.

తంగేడు విత్తనములను జాగ్రత్తగ చితుకకొట్టవలయును. పైనుండు నలుపులు తీయవలయును. పచ్చనిబేడలు కానుపించును. వాటిని శుభ్రమయిన గాజు కల్వములో మెత్తగనూరి పొడిచేయవలయును. ఆసుపత్రులకు దూరముగనుండు గ్రామస్థుల పిల్లల కండ్లు కలకలు, నీరు, పుసి కారుచుండిన సిద్ధమయిన పొడిని చేతివేలికి కాటుకమాదిరి తీసికొని క్రింది రెప్పలకు రాచిన నీరు కారుట నిల్చిపోవును. కండ్లు అంటుకొనవు. దురదలు కల్గిన, పిల్లలు మురికి చేతులతో రుద్దుకొనిన కండ్లువాచును. ఆ చూర్ణమునే కొద్దిగ గోరువెచ్చని నీటిలోవేసి ఆ నీటితో కండ్లు తుడిచిన దురదలు మానును

వాడుటకు సులభమయిన పద్ధతి మరియొకటికలదు. చేతి వేలిపయిన చాలినంత వుంచుకొని కండ్లలో వ్రాదిన చాలును. లేదా మంచి కొబ్బరి నూనెలో కొంచెము కల్పి కాటుకగా పెట్టినను పెట్టవచ్చును.

లంక ప్రాంతములనుండువారు కాఫీ, టీ, పానీయములనునిల్పి మధుమేహవ్యాధి గ్రస్థులు మూత్రదోషములుకలవారు విత్తనములను వేయించి కాఫీకి మారుగను, ఆకులు యెండించి టీ పానీయముగను చేసికొని త్రాగుదురు.

---

# వివిధ విషయములు



నవంబర్ 7 వ తేదీనుంచి 13 వ తేదీవరకు అధికారేతర వయోజన విద్యా బోధకుల శిక్షణ శిబిరం కోయిలకుంట్లలో నిర్వహించబడింది. ఈసందర్భంలో అభ్యర్థులకు స్వాగతం చెప్పుతూ కార్యదర్శిని శ్రీమతి కె. లక్ష్మీనారాయణమ్మగారు ఇలాచెప్పారు.

అవిద్యతో నిండిపోయిన ఆంధ్రదేశంలో అక్షరాస్యతా ప్రచారం ఎక్కువ అవసరంగా వుందనే సంగతి మీకందరకు తెలిసిందే. ఈ అవసరాన్ని గుర్తించి ప్రభుత్వం పెద్దల విద్యావ్యాప్తికి కృషి చేస్తూనేవున్నది. కాని అనుకున్నంత విజయవంతంగా సాగటంలేదు. మనది ప్రజా ప్రభుత్వం. ప్రజా రాజ్యంలో అన్ని కార్యాలు ప్రభుత్వమే చేస్తుందని మనం గోళ్లు గొరుక్కుంటూ కూర్చోవటానికి వీల్లేదు. ప్రభుత్వానికి అండగా ముందుకువచ్చి ప్రజానాయకులు విచారించి, గుర్తించి సేవకు నడుము కట్టాలి. అప్పుడే దేశం బాగుపడుతుంది. దేశజనాభాలో దాదాపు సగంవరకు స్త్రీలున్నారు. విద్యా సంస్థల నడపటంలో స్త్రీలుగూడా పురుషులతోపాటు ముందంజ వేయాలి. అందుకు తగిన అవకాశాలను పురుషులు కల్పించాలి. సంసార రథం సజావుగాను సుఖంగా శాంతిసౌఖ్యాలతో సాగి పోవాలంటే అందులోని స్త్రీ పురుషులందరూ విజ్ఞానవంతులు కావాలి. విజ్ఞానం సంపాదించాలంటే విద్య నేర్చుకోవాలి. ఈసత్యాన్ని మీరందరూ గుర్తించి అక్షరాస్యతా ప్రచారానికి సంపూర్ణ సహకారం చూపిస్తారని ఆశిస్తున్నాను. నిరక్షరాస్యులతో క్రుంగిపోతూవున్న ఆంధ్రమాతను ఉద్ధరించి, సేవించ టానికి ఉత్సాహంతో ముందుకువచ్చిన మీకు మహిళా సంఘం పక్షమున స్వాగతం! సుస్వాగతం!



## శ్రీమతి అహల్యా సంతానంగారు

ఈమె మద్రాసు కార్పొరేషనుకు డిప్యూటీ మేయరుగా ఎన్నుకోబడిరి. వయస్సు 38 సంవత్సరములు. న్యాయ వాదియైన సంతానంగారి సతీమణి. శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మీ రెడ్డిగారి మేనకోడలు. నగరంలో ప్రసిద్ధ సంఘసేవకురాలు. ఈ సందర్భమున శ్రీమతి అహల్యా సంతానం గారు అభినందనీయులు.

*సండే స్టాండర్డ్ వారి సౌజన్యంతో

శ్రీ హెచ్. వి. బాబుగారి దర్శకత్వము క్రింద 'ఆదర్శం' అనే చిత్రాన్ని శుభోదయా ప్రొడక్షన్సు వారు నిర్మిస్తున్నారు. గౌరీనాథశాస్త్రీ, జానకి, శమంతకమణి మొదలగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

ప్రతిభా పిక్చర్సు లిమిటెడ్ వారు 'చిన్నకోడలు' అనే చిత్రాన్ని నిర్మిస్తున్నారు. దర్శకుడు బలరామయ్య.

♦ ♦ ♦

శోభనాచల పిక్చర్సువారు 'సావాసం' అనే చిత్రాన్ని నిర్మిస్తున్నారు. దీనికి మీర్జాపురం రాజావారు దర్శకులు.

♦ ♦ ♦

'రాజేశ్వరి' అనే తెలుగు చిత్రాన్ని ఆర్. పద్మనాభన్ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్నారు. శ్రీరంజని, శ్రీరామమూర్తి నటిస్తున్నారు.

♦ ♦ ♦

శ్రీ ముక్కామల కృష్ణమూర్తిగారి దర్శకత్వము క్రింద 'మరదలు పెళ్లి' చిత్రము నిర్మించబడుతున్నది. నిర్మాతలు యం. కె. యమ్. ప్రొడక్షన్సు.

♦ ♦ ♦

భరణీ పిక్చర్సువారి 'ప్రేమ' చిత్రం మార్చి నెలలో వెలువడుతుందని వార్త.

♦ ♦ ♦

'మై హోమ్' అనే చిత్రాన్ని అవర్ ఇండియా ఫిలింసువారు నిర్మిస్తున్నారు. సాహిత్యం కృష్ణశాస్త్రిగారిది, దర్శకుడు నాగయ్య.

♦ ♦ ♦

రాజ్యం ప్రొడక్షన్స్‌వారి 'దాసి' చిత్రం రేవతి స్టూడియోలో నిర్మాణం చురుకుగా సాగుతున్నది.

♦ ♦ ♦

వినోదా పిక్చర్సువారి 'దేవదాసి' చిత్ర నిర్మాణం ప్రారంభమయింది. దర్శకుడు వేదాంతం రాఘవయ్య. రచన సముద్రాల.

——(o)——

# మన ఓటు

శ్రీమతి గొట్టిపాటి మహాలక్ష్మమ్మగారు

భారతస్వాతంత్ర్య సంగ్రామములో స్త్రీపురుషులిరువురు ఏకమై పోరుసలిపి అనేకమైన దుర్భరకష్టములకుగురియై, అత్యంతశ్రమకులోనై, కడకు స్వాతంత్ర్యమును పొందినారు. గాన ఆస్వాతంత్ర్య ఫలమనుభవించుటకు స్త్రీపురుషులెల్లరకు హక్కుకలిగియున్నది. కనుక స్త్రీలకు అభివృద్ధికలుగజేయు హిందూకోడ్‌బిల్లును న్యాయమూర్తులున్నూ, సత్యసంధులున్నూ, దేశభక్తులున్నూ, కుల, మత, లింగ, భేదములను త్యజించి దేశసౌభాగ్యమునకై ప్రాణమొడ్డుటకైననూ సంసిద్ధులై విజయముపొందిన పండిత జవహర్‌లాల్ నెహ్రుగారున్నూ, డాక్టరు అంబేడ్కర్ గారున్నూ పార్లమెంటులో ప్రవేశపెట్టినారుగదా! ఆపార్లమెంటు సభ్యులలో కొందరు వివాదగ్రస్థులై, కుపితులై, స్వార్థపరులై, వివేకశూన్యులై తోటిస్త్రీల అభివృద్ధి నిరోధకచర్యలవలంబించి, అవివేకవంతులైన కొందరు స్త్రీలను లొంగదీసి వారిచేత స్త్రీ స్వాతంత్ర్యవ్యతిరేక నినాదములిప్పించి ఇంకను భయంకరవివాదములతో హిందూకోడ్‌బిల్లును అన్యాయముగ వాయిదావేయించినారుగదా! ఈవ్యవధిలోనే ప్రజలకు స్వాతంత్ర్యమునకు భంగముకలిగించే ప్రెస్‌బిల్లును ముందుకు తీసుకొనిరాలేదా? ఇంకను మరికొందరు పురుషులు "స్త్రీలకు విజ్ఞానము సున్న అగుటచేత స్వాతంత్ర్యము కలిగిననూ అనుభవించలేరని" సాకులుచెప్పుచున్నారు. ఈవాదన భారతస్వాతంత్ర్య సంగ్రామసమయములో "భారతదేశము విజ్ఞానవిహీనమైనది గాన స్వాతంత్ర్యము ఇచ్చిననూ నిర్వహించుకోలేరని" చర్చిల్ చెప్పినట్లుగానున్నది. ఇట్టి చర్యలుచూచి విచారించగా దేశస్వాతంత్ర్యఫలితమును పురుషులే యనుభవించుచూ స్త్రీలకు ఎప్పటి బానిసత్వమే అంటగట్టుట వీరి న్యాయమైయున్నదని తెలియుచున్నది. ఇట్టి సందర్భములో స్త్రీలు నిద్రమేల్కొంచుటవసరమైయున్నది. సోదరీమణులారా? మనదేశములో ఎన్నికలు సమీపించుచున్నవి కాన మనఓటు ఎవరికివ్వవలెను అనేప్రశ్న ప్రతివారి హృదయములోను కలచివైచుచున్నది. ఓటు దుర్వినియోగముచేయుట మానవుల విధికాదు. మనఓటు మనఅభివృద్ధి నిరోధకులకిచ్చుటతగదు. ఆలోచించి పార్టీవిభేధాలు పాటించక స్త్రీలకు సహకారమిచ్చే అభ్యర్థులకే మనఓటు నివ్వవలెను. మరియు "అనుకూలముగ చెప్పుమాటలకు మోసపోక" వారిగుణశీల స్వభావాదులు ఉత్తమమయిన వైనచో స్త్రీలకు సహాయముచేయు అభ్యర్థులు ఏపార్టీవారైతే మనకేమి అపాయము సంభవించును? స్త్రీ అభివృద్ధినిరోధకులు ఏపార్టీవారైతే మనకేమిలాభము కలుగును? అభ్యర్థుల శుభలక్షణ సుగుణములనుగ్రహించి మనఓటు సద్వినియోగము చేసినయెడల మనకు శుభము

కలుగును. జిల్లాకు ఇరువురు స్త్రీలను అభ్యర్థులుగా దరఖాస్తులు వారు పెట్టకపోయిననూ ప్రోత్సహించి నిలబెట్టవలయునని పండితజవహర్‌లాల్ నెహ్రూగారు ప్రకటించగా ఆంధ్ర దేశభక్తులు "అట్టిసమర్థులు స్త్రీలలో లేరని" చెప్పుట చాల హేయకరమైన విషయము కాగా స్త్రీలలో దరఖాస్తులు పెట్టుకొన్న వారినిగూడ త్రోసివేసి పురుషులను నిలబెట్టుట మరింత శోచనీయమైన విషయముగాన! ఈ పరిస్థితులను సోదరీమణులు గ్రహించి స్త్రీ అభివృద్ధినిరోధకులకు ఓటునివ్వక స్వార్థత్యాగులకే ఓటుఇచ్చెదరుగాక. అపుడే హిందూ కోడ్‌బిల్లు నిరాఘాటముగ ప్యాసై మనకు బానిసత్వము పటాపంచలైపోయి స్వాతంత్ర్య ఫలితమును అనుభవించగలము. ఈసంగతి గ్రహించక పార్టీద్వేషాలతో నిండిన స్వార్థ పరులకిచ్చిన మనము కొన్ని సంవత్సరములు వెనుకబడియేయుందుము. సోదరీమణు లారా! మనఓటు స్త్రీ ఉద్యమమునకు సహకారమునిచ్చు వివేకవంతులకేఇచ్చి స్వేచ్ఛాస్వాతంత్ర్యము లనుభవించెదముగాక! పురుషులలో నిలబెట్టబడిన అభ్యర్థులు ఎంతటి విద్యావంతులో ఎంతటిమేధావులో, అంతటివివేకవంతులు అంతటిమేధావులు స్త్రీలలో లేరని వాదించుటలో, వారిలోగల సమానత న్యాయధర్మములు మనము గ్రహించగలముగాన విచారించి రానున్నఎన్నికలలో చాల తెలివిగ ప్రవర్తించి ఓటును సద్వినియోగము చేయవలయును. అపుడే మహిళా స్వాతంత్ర్యము నిరాఘాటముగ పొందగలము; సందేహములేదు.

# లోకవార్తలు

హిమాచల్ ప్రదేశ్ అసెంబ్లీ 36 స్థానాలలో 21 స్థానములు కాంగ్రెస్ కు లభించినవి. ఇది కాంగ్రెస్ కు ప్రథమ విజయం.

◆ ◆ ◆

సూయజ్ ప్రాంతములోని ఈజిప్షియన్ల గృహములను బ్రిటిషు సైన్యాలు కూలగొట్టడాన్ని అధిక్షేపిస్తూ, ఆ ప్రాంతములో బ్రిటిషు సైనికులు సాగిస్తున్న హింసాకాండపై ఈజిప్టు ఐక్యరాజ్య సమితికి ఫిర్యాదు చేస్తుందట.

◆ ◆ ◆

పండిత నెహ్రూగారి ఆంధ్రదేశ పర్యటన డిశంబరు 26వ తేదిన హిందూపురములో ప్రారంభించి 27వ తేదిన విశాఖపట్నములో ముగుస్తుంది.

◆ ◆ ◆

జాతీయ బాలభారతీ గ్రంధనిలయ 15వ వార్షికోత్సవము నవంబరు 24వ తేదీన జరిగినది. గుంటూరు జిల్లా గ్రంధాలయ కార్యదర్శి శ్రీ అడుసుమల్లి శ్రీనివాసరావుగారు సభను ప్రారంభించారు. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు అధ్యక్షత వహించిరి.

◆ ◆ ◆

ఆంధ్ర విశ్వవిద్యాలయములో ఔషధోత్పత్తి శాఖ నూతన భవనాలను కేంద్ర ఆరోగ్యశాఖ మంత్రిణి రాజకుమారి అమృత్ కౌర్ తెరచారు.

◆ ◆ ◆

ఏటేటా తిరుచానూరులో జరిగే పద్మావతీ తాయార్ ఉత్సవం నవంబరు 25వ తేదిన ప్రారంభమయి. యీ నెల 3వ తేదిన పద్మా సరోవరంలో పవిత్ర స్నానంతో సమాప్తి అయింది.

◆ ◆ ◆

హైదరాబాదు ప్రభుత్వమువారు ప్రాంతీయ భాషలైన తెలుగు, కన్నడము, మరాటీలలో బాల సాహిత్యాన్ని పెంపొందింపచేయడానికి ఒక సంఘాన్ని స్థాపించారు.

◆ ◆ ◆

హైదరాబాద్ నగరములోని ఎనిమిది నియోజక వర్గములకు ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ ఒక్క ఆంధ్ర ప్రతినిధిని కూడ అభ్యర్థిగా నియమించక పోవడం చాల అన్యాయమని సికిందరాబాద్ లోని ఆంధ్రులు అసంతృప్తి పడుతున్నారు.

◆ ◆ ◆

జాగీర్దార్లు, నవాబులు, రాజులయిండ్లలో బాల బాలికల వెట్టిచాకిరి నిషేధించబడిందనియు, ఆ బాల బాలికలకు సంఘంలో సముచిత స్థానం యివ్వబడుతుందని హైదరాబాద్ ప్రభుత్వము ప్రకటించింది.

◆ ◆ ◆

అస్సాం ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి సతీమణి శ్రీమతి మనోరమ మెహతా షిల్లాంగ్ నియోజక వర్గమునుండి సోషలిస్టుపార్టీ తరఫున ఆరోగ్య శాఖా మంత్రితో పోటీచేస్తున్నది.

◆ ◆ ◆

వచ్చే ఏడాది 50 లక్షల టన్నుల ధాన్యము మన దేశమునకు యితర దేశములనుండి దిగుమతి చేయబడుతుందట.

◆ ◆ ◆

ఐక్యరాజ్య సమితిలో ఇటలీకి సభ్యత్వం యివ్వాలని ధర్మకర్తృత్వ సంఘము సిఫారసు చేసింది.

◆ ◆

పెళ్ళయిన నెలలోపలనే జీవితమునీద విరక్తి చెంది 'బేబీ అమ్మాళ్' అనే 13 సంవత్సరముల బాలిక నిప్పంటించుకొని మద్రాసులో చనిపోయింది.

◆ ◆ ◆

మధ్య భారత్‌లో కాంగ్రెస్ అధ్యక్షుడు ఎన్నికల ప్రచార సందర్భంలో అధికారం అల్పపక్షాల పరమైతే దేశం సర్వనాశనమైపోతుంది అని హెచ్చరించారు.

◆ ◆ ◆

దేశంలో పెట్రోలియం సంబంధమయిన పదార్థముల ఉత్పత్తికొరకు క్రొత్తగా యిక్కడ ఏర్పాటయిన ఇండో-ఇరానియన్ నూనె కంపెని (కలకత్తా) దేశంలోనున్న నూనె గనులను పరిశోధించి త్రవ్వించడానికి నిశ్చయించుకొన్నది.

◆ ◆ ◆

ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం భారత ప్రతినిధివర్గనాయకుడు శ్రీ బి. యన్. రావును అంతర్జాతీయ న్యాయస్థానమునకు న్యాయమూర్తిగా ఎన్నుకొంది.

◆ ◆ ◆

ఫ్రెంచి యిండియా ప్రజాసభ ఎన్నికల సందర్భంలో ఫ్రెంచి ఇండియా సోషలిస్టుపార్టీ అభ్యర్థులతో పోటీని మిగిలిన ఫ్రెంచి ఇండియా భారత దేశంలో లీనమైపోవాలని కోరేపార్టీలు బహిష్కరించుటచే ఎన్నికలు ప్రారంభం కాకుండానే పూర్తి అయినవి.

◆ ◆ ◆

నేపాల్‌లో యీ మధ్య ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వానికి ఇండియా సహకారాన్ని పండిత నెహ్రూ హామీ యిచ్చాడు.

◆ ◆ ◆

1952-వ సంవత్సరములో 3-వ ప్రపంచ యుద్ధము రానున్నదనియు, ఆ సందర్భంలో ఆటంబాంబులు ప్రయోగించబడుతవనియు ప్రఖ్యాత జ్యోతి శ్శాస్త్రజ్ఞురాలు శ్రీమతి ఇందుమతిపండిత చెప్పింది. ఈమె యింతకుముందు బ్రిటనులో చర్చిలుపార్టీ జయమును గురించి, పాకిస్థాన్ ప్రధాని లియాకత్ ఆలీఖాన్ హత్య జరుగుతుందని చెప్పిన జోస్యం నిజమైందట.

ఎన్నికల తగాయిదాలను విచారించే అధికారం హైకోర్టుకు లేదని మద్రాసు న్యాయమూర్తులు తమ యభిప్రాయమును తెలిపారు.

◆ ◆ ◆

హరిజనాభివృద్ధికి 125 లక్షల రూపాయలను ప్రభుత్వము ఖర్చుచేస్తున్నదని మద్రాసు మంత్రి శ్రీగోపాలరెడ్డిగారు చిదంబరములో ప్రకటించారు.

◆ ◆ ◆

కేంద్ర పరిశ్రమల మంత్రి మోహతబ్ భారత ఆర్థిక విధానంపై స్థిరనిర్ణయాలు చేయడమనేది ఎన్నికల తరువాతనే నని వివరించారు.

◆ ◆ ◆

రైల్వే మంత్రి గోపాలస్వామి అయ్యంగారు మరో నాల్గేళ్లలో ఏడాదికి 120 రైలు ఇంజన్ల నిర్మాణావకాశమున్నదని 'చిత్తరంజన్' యంత్రాగారములో సాగుతున్న పనిని వివరించారు.

◆ ◆ ◆

బొంబాయిలో సోషలిస్టు ప్రదర్శనంపైన, బెంగాలులో ప్రజాపార్టీ సమావేశములలోను ఎన్నికల ప్రచార సందర్భంలో కాంగ్రెస్ వాదులు దౌర్జన్యము జరుపుతున్నట్లు వార్తలు వస్తున్నవి.

◆ ◆ ◆

కట్టెల కొరతవలన బొంబాయి కార్పొరేషను శవదహన సంస్కారమునకు విద్యుదగ్ని గుండం ఏర్పాటు చేయడానికి సంకల్పించింది.

◆ ◆ ◆

మద్రాసు వాణిజ్య పంటల మార్కెటింగు చట్టాన్ని గుంటూరు పొగాకు మార్కెటింగు కమిటీ వారు వేరుసెనగ విషయంలో కూడ అనువర్తింపచేయ అనుమతించ వలసినదనియు, వేరుసెనగ పంట విషయంలో ప్రధానమైనదిగా ప్రకటించ వలసినదనియు ప్రభుత్వమును కోరుచు తీర్మానించారు.

◆ ◆ ◆

పండితనెహ్రూ సోదరి కృష్ణహతీసింగ్ రాష్ట్ర అసెంబ్లీకి సోషలిస్టు పార్టీతరఫున బొంబాయి నగరమునుండి పోటీచేయుచున్నది.

అందచందములు చూడ మెచ్చుటకు, ఎంతను లోపమున్నట్లు కానుపించదు. ఎందులకనిన నటకులందఱు నవీన విద్యావంతులే. పట్టభద్రులే; ఆనందమయిన ఆంధ్రభావనుడులు నేడింకను వినుపించినందులకు శ్రీ డాక్టరు కేసరిగారికిని, శ్రీ బండి, శ్రీ హరిరావునాయుడుగారికిని, ఆంధ్ర నాటక ప్రదర్శకులకును వందనీయులమని చెప్పక తప్పదు.

మరియు శ్రీ డాక్టరు కేసరిగారికి శ్రీ బండి. శ్రీ హరిరావునాయుడుగారు పుష్పమాలను అలంకరింప చేయు సందర్భమున ఆంధ్ర బాలబాలికల తరఫున పూజాపుష్పముల నంద చేసినట్లేయున్నది. శ్రీ కేసరిగారు కడు పెద్దలు, సంపన్నులు. లలితకళా పోషకులు; పెక్కుసంస్థలకు అధిపతిఅయ్యూ, నేడు మనతో కూడ వయోవృద్ధాప్యమును పాటింపక మనలను సక్రమమయిన జీవితమార్గములోనకుపు కూరకేసరివలె మననేత్రములకు కనుపట్టుట మనకుముందు మంచి మార్గమే యున్నదని విద్యార్థులలో గుసగుసలు చెలరేగినవి.

నాటకము మగియువరకు లెక్షను ఒక్కరయినను కదులుటగాని, వృధా కాలయాపన ముచ్చట్లుగాని లేవు. నిశ్శబ్దమును శాంతియుకల్గి జయప్రదముగ సాగినది.

కోట వెంకట రంగయ్య




## పాతివ్రత్య మహిమ

పూర్వం ధారానగరాన్ని భోజమహారాజు పరిపాలిస్తూండేవాడు. అతను ప్రతి రాత్రి ప్రచ్ఛన్న వేషంతో పట్నం అంతా సంచరిస్తూ, ప్రజల కష్టసుఖాల్ని తెలిసికొంటూండేవాడు.

ఒకనాటిరాత్రి అతనలా తిరుగుతూ, ఓయింట్లో ఆశ్చర్యకరమైన ఒకదృశ్యం చూశాడు. ఒకగృహిణి తొడమీద భర్త నిద్రిస్తున్నాడు. అగ్నిహోత్రం ఓవైపు దేదీప్యమానంగా వెలుగుతోంది. ఆదంపతుల అనుంగు బిడ్డడు కాబోలు! మంటలవైపు పోతున్నాడు, దాంతో ఆడుకోటానికి. పాపం! వానికేం తెలుసు అది నిప్పు, కాల్తుందని. అలా పోతున్న పిల్లాడ్ని చూసినా, తల్లి నిశ్చలంగానే కూర్చుంది! ఆమె మగనికి నిద్రాభంగమాతుందని. 'పసిపిల్లాడి నీలా ప్రమాదంకు గురి ఔతున్నా, వారించలేదేమా' అని భోజరాజుకు సందేహం కలిగింది. ఓస్థలంలో దాగి, తిలకిస్తున్నాడా వింతను.

ఇంతలో ఆగృహలక్ష్మి అగ్నిహోత్రుని ధ్యానం చేయ మొదలిడింది. "హేభగవాన్! హుతాశన! నాచిన్ని కుమారుడు నీతో ఆడుకోవటానికి వచ్చేస్తున్నాడు. వానిని మరల్చుదామంటే నాతొడమీద నాథుడు నిద్రిస్తున్నాడు. అతనికి మెలకువ వచ్చేస్తుందేమోనని శంకించి, నిస్సహాయనై చూస్తూ కూర్చున్నాను. భారతమహిళలకు పుత్రవాత్సల్యం కన్నా పతిభక్తి గురుతరమైనదికదా! దేవా! నేనొక పతివ్రతనైనట్లయితే, నాయందు అనుగ్రహముంచి, నాపాపడికేమి హానిలేకుండా చెయ్యి తండ్రీ!" మనసార ప్రార్థించిందా సాధ్వి. వీతిహోత్రుడు ప్రసన్నుడయాడు కాబోలు! కుర్రాడు మంటలతో సరదాగా ఆడుకొన్నాడు!! భోజరాజు, ఇంకా ఏంజరుగుతుందో చూడ కుతూహలుడయాడు.

కొంతతడవయాక ఆయిల్లాలి ప్రాణనాయకుడు తనంతట తనే నిద్రనుండి మేల్కొంచాడు. వెంటనే ఆమె పరుగునపోయి ముద్దులబిడ్డను తనముందుకు లాగుకుంది. భర్త 'ఏమా విపరీతం' అని వెలవెలబోతున్నాడు. ఆమె జరిగినదంతా అతనికి తెల్పింది. ఇద్దరూ తమ తొలిపంటతో సహా అగ్నిదేవునికి హృదయపూర్వకంగా అంజలు సమర్పించారు. మహారాజు హృదయం సంతోషంతో తొణికిపోయింది తన రాజ్యంలో ఉన్న సాధ్వీమతల్లుల్ని తలచుకొని.

మర్నాడు నిండుసభలో చిదానందంతో ఉన్న భోజమహారాజు చిన్న సమస్య నొక దాని నిచ్చేడు మహాకవి కాళిదాసుకు.

'సుతం పతన్తం ప్రసమీక్ష్య పావకే నబోధయామాస పతిం పతివ్రతా!' అని

పండితులందరూ నివ్వెరపోయి చూస్తున్నారు. మంత్రులు, సామంతులు గుసగుసలాడుతున్నారు. పరిచారకులు పనులు నిలుపుచేసి రాజువంక దీక్షగా చూస్తున్నారు. ఇదేం వింతైన విషయమో అని. క్షణకాలం కాళిదాసు ఆలోచించి, సమస్యను సరిగ్గా పూరించి చదివేడు.

'సుతం పతన్తం ప్రసమీక్ష్య పావకే నబోధయామాస పతిం పతివ్రతా!
తదా తత్పతి భక్తిగౌరవాత్ హుతాసనశ్చందన పంక శీతలః||' అని

[దానిభావం; అగ్నివైపు పోతున్న కుమారుని చూసి కూడా, ఒక పతివ్రత భర్తనులేపి శిశువును రక్షింప యత్నించలేదు. అందుచే ఆమెయొక్క పతిభక్తి, భర్తయందలి గౌరవమును హర్షించి, అగ్నిహోత్రుడు ఆబాలకునకు మంచి గంధమువలె చల్లగా ఉండేలా అనుగ్రహించేడు.]

సభాసదులంతా ఆశ్చర్య పోయేరు. భోజరాజు ఆనంద పూరితుడయేడు. 'ఇంతటి మహిమగల పతివ్రతలు, ఇంతటి పాండిత్యము, సమయస్ఫూర్తి ఉన్న కవిపుంగవులు గల తన రాజ్యం సుభిక్షంగా చిరకాలం వర్ధిల్లుతుందని విశ్వసించేడు భోజమహీపాలుడు.

ఇప్పటికీ అటువంటి పతివ్రతామ తల్లులుండటం చేతనే మనదేశం ఈమాత్రంగానైనా ఉండనటంలో సందేహం లేదు!

కుమారి గుళ్లపల్లి నాగరత్నం

---



కేంద్ర ఆరోగ్యశాఖామంత్రిణి రాజకుమారీ అమృతకార్ డిశంబరు 7-వ తేదిన ఆంధ్ర మెడికల్ కాలేజి అధ్యాపకులను, విద్యార్థులను ఉద్దేశించి యిట్లుపన్యసించిరి.

బ్రిటనులోమాదిరి మనదేశంలోనూ వైద్యవృత్తిని జాతీయం చేయడం వెంటనే జరుగాలి. ప్రకృతి, ఋతువులు సయితం యీ విధంగా చిన్నచూపుచూడ నారంభించినప్పుడు అన్ని రోజులు ఒక్కలాగే యుంటాయనుకోవటంకూడదు. ప్రతియొక్కరు దేశాభివృద్ధికోసం తమ శక్తినంతా వినియోగించి కృషి చేయాలి.

♦ ♦ ♦

శ్రీ జయప్రకాశ్ నారాయణ్‌గారు ఈ నెల 8-వ తేదిన మద్రాసులో బ్రహ్మాండమైన బహిరంగ సభలో నుపన్యసించుచు నిట్లనిరి.

పరిస్థితులు యథాతథంగా నుండాలా లేక సాంఘిక మార్పులు జరగాలా అన్నది యీ ఎన్నికలలో ప్రధాన సమస్య. ఆ విషయమై ఒక నిశ్చయానికి రావలసినవారు ఓటర్లు. దేశసంపద సమానంగా వెంటనే పంపకం కావలన్నదే సోషలిస్టుపార్టీ ఆశయం.

♦ ♦ ♦

కడపజిల్లా ఉపాధ్యాయి యూనియన్ సమావేశంలో యీ విధంగా ప్రభుత్వాన్ని కోరుచు తీర్మానించారు.

ఉపాధ్యాయుల కరువు భత్యాలను హెచ్చించాలి. ఉపాధ్యాయునికి కనీస జీతం నెల 1-కి రు 100 లను నిర్ణయించాలి. మేనేజిమెంటులు ప్రతి నెల 10-వ తేదిలోపల జీతాలిచ్చే ఏర్పాటులు చేయాలి.

♦ ♦ ♦

నవంబరు 30-వ తేదిన ప్రజాపార్టీ తరఫున బెజవాడ నియోజక వర్గములో నిలబడుచున్న శ్రీ యన్. తులసీరావుగారు సత్యనారాయణ పురములో నిట్లుపన్యసించిరి.

ప్రజాపార్టీ ప్రభుత్వ పరిపాలనలో ప్రజోపకరమైన కొన్ని సంస్కరణలను చేయడానికి అవకాశం కలుగజేయమని అర్థిస్తున్నాను. ప్రజలకు తిండి, నీడ, గుడ్డ అత్యవసర వస్తువులు. అవి సక్రమముగా నందటమే ప్రస్తుతావసరము. ఈ అవసరాన్ని నాలుగు సంవత్సరములనుండి గుర్తించి కాంగ్రెస్ ప్రభుత్వం నిర్వహించ చేయజాలకపోయింది. నిజాయితీ, శ్రద్ధలను ఋజువు చేసికోడానికి నాలుగు సంవత్సరములు చాలును.

# సంపాదకీయములు

## ఆదర్శాలు - ఆచరణ :

"గ్రామజీవనాభ్యున్నతికి విజ్ఞానవంతులైన యువతీ యువకులు నడుముకట్టాలి."

"బ్రిటనులోవలె ఇండియాలో సయితము వైద్యవృత్తి జాతీయం గావించబడాలి"

"విశ్వ విద్యాలయములు సాంస్కృతిక జీవనానికి మూలస్థానాలు కావాలి."

మొదటి రెండు సుభాషితములు కేంద్ర ఆరోగ్య శాఖమంత్రిణి రాజకుమారి అమృతకౌర్ ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవ సందర్భమున పట్టభద్రుల నుద్దేశించియు, ఆంధ్ర మెడికలు కాలేజి అధ్యాపకులను, విద్యార్థుల నుద్దేశించి పలికినవి.

మూడవది రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ అలీఘర్ స్నాతకోత్సవ సభలో పలికినది.

పై మూడు సూత్రములు గాంధీ వాదమునకు, జాతీయోద్యమమునకు పునాదులవంటివి. ఇట్టివానిని గాంధీజీ బోధనలయందు, జాతీయ వాదమునందు అచంచలమగు నమ్మకముగల డా. రాజేంద్రప్రసాద్, రాజకుమారి అమృతకౌర్‌లు ఉద్బోధించారంటే వారి ఉత్తమ ఆదర్శాలు, విశాలదృక్పథమే కారణము.

అయితే యిట్టి ఉత్తమ ఆదర్శాలు, విశాల దృక్పథము కలవారు నాయక శ్రేణిలో సయితము అరుదు. ఉన్నత విద్యాభ్యాసమువలన గడించిన విజ్ఞానమును పల్లెప్రజ సౌభాగ్యమునకు వినియోగించమని గాంధీజీ అనేకసార్లు చెప్పాడు. దానిని యింతవరకు ఏమాత్రము పాటించారు? ఇకముందు మాత్రము పాటించటానికి అవకాశములు ఏమిటి?

భారతదేశం బీదదేశం. ఉన్నత విద్యాభ్యాసం యీనాటికిని అధిక సంఖ్యాకులకు అందుబాటులో లేదు. కొద్ది గొప్ప ఆస్థులను అమ్ముకొని ఉన్నత విద్యాభ్యాసము చేసినవారికి ఉద్యోగం సంపాయించుకొని పొట్టపోసు కొనుటకంటే వేరుమార్గంలేదు. అట్టివారు సంఘసేవను కలలోకూడ తలచలేరు. ఇక విద్యాధికులైన కొద్దిమంది సంపన్నులు విశాలదృష్టితో తమ విజ్ఞానమును ప్రజాశ్రేయస్సు కొరకు వినియోగపరచ పూనుకొనేవారు బహు కొద్దిమంది.

ఈపరిస్థితులలో గ్రామజీవనాభ్యున్నతికి నడుముకట్టువారెవరు? అనేది ప్రశ్న. అందుకు జవాబు ఒక్కటే - ఉన్నత విద్యాసౌకర్యాలు ఉచితంగా అందరికి అందుబాటులోనున్ననాడే తాముగడించిన విద్య, విజ్ఞానములను సంఘ శ్రేయస్సుకొరకు వినియోగించ యువతీ యువకులు పూనుకోగలుగుతారు.

వైద్యవృత్తిని జాతీయంచేయడం అవసరమే కాని, సంఘ శ్రేయస్సుకు, సౌభాగ్యాలకు అవసరమయిన సంపదను సమకూర్చు పరిశ్రమలు, వర్తక వ్యాపారములు, వ్యవసాయముల జాతీయం చేయుడం అంతకంటే అవసరం. వానిని జాతీయం చేయడంవలన ఆర్జించిన జాతీయ సంపదను సంఘ శ్రేయస్సుకొరకు వినియోగించుకోవచ్చును. కాబట్టి జాతీయంచేసే సందర్భంలో వైద్యమును బోలినవృత్తులను మాత్రముకాక పరిశ్రమలను, వర్తక వ్యాపారములను, వ్యవసాయము సయితము జాతీయముచేసిననే కాని ప్రజలు తమ విజ్ఞానమును, శక్తి సామర్థ్యములను, సంపదను స్వార్థరహితులుగా దేశశ్రేయస్సుకు వినియోగించలేరు; విద్య, వైద్య సహాయము అందరికి సునాయాసంగా అందుబాటులోకిరావు. ఆనాడే విశ్వవిద్యాలయాలు నిజంగా సాంస్కృతిక జీవనానికి మూలస్థానాలగుతవి.

ఇట్టి ఆదర్శాలు ఆచరణ రూపందాల్చే దెప్పటికో!




కేనోపనిషత్తు : శ్రీ అరవిందుల నిజతత్త్వ స్వరూప సయితము. రచన శ్రీ అరవిందులు; అనువాదము : శ్రీ ఆర్. ఎ. భరద్వాజ్. ప్రచురణము : తెనుగు ప్రచురణ లేఖ, శ్రీ అరవిందాశ్రమం, పుదుచ్చేరి. వెల మేలురకము ప్రతి రూ 2-8-0, సాధారణ ప్రతి రు 2-0-0.

శ్రీ అరవిందయోగి మహిమాన్వితుడు, అద్వితీయుడు, స్వతంత్రుడునగు తత్త్వవేత్త, అనుభవముగల జ్ఞాని, ద్రష్ట, యోగి, భగవద్దర్శనానంద మనుభవించిన ఋషిపుంగవుడు.

అట్టివాడు కేనోపనిషత్తు గురించి వ్రాసిన వ్యాఖ్యానముగాని, చేసిన అనువాద రచనగాని అద్వితీయముగను, అతిరమ్యముగను, రుచికరముగను ఉండుననుట నిండు చంద్రుడు నిర్వికార శుభంకరుడని చెప్పుటయే యగును.

ఇందు శ్రీ అరవిందుల ప్రశంస, "ఆర్య" నాల్గవ వర్ష చరిత్ర, కేనోపనిషత్తు నాల్గుఖండముల అనువాద-వ్యాఖ్యలు (తాత్కాలికముగ నుపయోగింపబడినను సమమైన అర్థములుగల "అపూర్వ" పదనిఘంటు)నుగలవు. సంస్కృత భాగములేగాక, శ్రీ అరవిందులస్వీయ ఆంగ్ల అనువాద భాగములుకూడ సరియైనచోట్ల పొందుపరుపబడినవి.

ఈశోపనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు, గీతావ్యాసముల ప్రశంసకూడ సందర్భానుసారముగ ఉల్లేఖింపబడినవి. యోగసమన్వయము, మానవసంఘ వికాస తత్త్వము, మానవ ఐక్యతాశయము గురించిన శ్రీ అరవిందాభిప్రాయములునుగలవు.

మనస్తత్త్వ శాస్త్రానుగుణ్యముగ ఈ రచన ఎంతయు సమర్థనీయముగను, సమాదరణీయముగను ఉన్నది. ఋగ్వేదభాగములు - రహస్యవేత్తల సిద్ధాంత సంగ్రహము ముఖ్యముగ అమూల్యమైనది.

ఆర్య ఋషుల సంప్రదాయమునకు చెందినవాడైన శ్రీ అరవిందుల ఈ అద్వితీయ, నిరుపమాన రచన మతత్రయము వారికిని అంగీకారమై, సరియయిన నిస్తులమగు బ్రహ్మజ్ఞానమునకు దారిచూపించునదియై యున్నది.

తెనుగు అనువాదము యించుమించు నిర్దుష్టమై, మూల గ్రంథమునకు చాల దగ్గరకు చేరియున్నది. ఇట్టి అనువాదము సుకరము కాదు. ప్రచురణ కర్తలు ధన్యులు. ఇది ధర్మ-మోక్షములయందు శ్రద్ధాభిరుచులుగల వారందరు తప్పక పఠించి లాభమొందదగు ఉత్తమ గ్రంథము. ఒకసారి చదివి పారవేయవలసినది కాదు.

జయంతి బ్రహ్మానంద.

## శ్రీ ఖరనామ సం॥ర మార్గశిర-పుష్య మాసములు.

| | | | |
|---|---|---|---|
| 1951 సం॥ డిసెంబరు నెల | 16 | ఆ | త 32.47 పున 17.33 రా 11.54 మూలధనుర్మాసారంభం |
| | 17 | సో | చ 37.31 పుష్య 27.29 రా 30.49 సంకష్టహరచతుర్థీ వ్రతం |
| | 18 | మం | పం 41.49 ఆశ్రే 29.7 శేషః 2.49 పునస్త్వాజ్యాభావః |
| | 19 | బు | ష 45.29 మఘ 34.1 ది 1.32 |
| | 20 | గు | స 48.14 పూఫ 38.17 రా 29.34 |
| | 21 | శు | అ 49 55 ఉఫ 41.24 కాలభైరవాష్టమి |
| | 22 | శ | న 50 24 హ 43.25 వ ఉ 7.42 మొ 9.21 వ మకరాయనం |
| | 23 | ఆ | ద 49.35 చి 44.15 ది 34.2 వ ఉ 7.57 మొ 9.34 వ |
| | 24 | సో | ఏ 47.39 స్వా 43.52 శేషః 2.8 సర్వోపవాసః |
| | 25 | మం | ద్వా 44.28 విశా 42.20 శేష ఉ 7.4 వ, వతె 3.16 మొ 4.48 వ |
| | 26 | బు | త్ర 40.16 అనూ 39.48 రా 25.21 వతె 3.40 మొ 5.10 వ |
| | 27 | గు | చతు 35.11. జ్యే 36.20 రా 27.22 వాజసేయీ అమావాస్య |
| | 28 | శు | ● అమా. 29.26 మూ 32.20 వ రా 5.56 మొ 7.26 వ |
| | | | పుష్యమాసము |
| | 29 | శ | శుద్ధపాడ్యమి 27.17 పూషా. 27.54 చంద్రోదయం |
| | 30 | ఆ | విదియ 17.1 ఉషా. 24.21 తిధిద్వయం |
| | 31 | సో | త 10 48 శ్రీ 18.56 రా 0.54 చతుర్థితిథిః |
| 1952 సం॥ జనవరి నెల | 1 | మం | చ 4.56. ఏషా 55.2 ధత్యా 3.47 వ రా 7.16 మొ 3.47 వ |
| | 2 | బు | ష 55.44 శత 11 35 ది 26.59 షష్ఠిసుబ్రహ్మణ్యార్చనం |
| | 3 | గు | స 52.32 పూభా 9.8 త్యా 3.55 వ రా 7.33 మొ 9.7 వ |
| | 4 | శు ● | అ 50.29. ఉభా 7.47 వ రా 9.36 మొ 11.12 వ |
| | 5 | శ | న 49.46 రే. 7.30. రా 30.49. త్యా 4.4 తె 5.55 మొ |
| | 6 | ఆ | ద 50 13 అశ్వ 8.42 శేవ ఉ 7.35 వ |
| | 7 | సో | ఏ 51.50 భ 11.0. వ 21.2 సర్వేషాం వైకుంఠ ఏకాదశీ శ్రీరంగాది క్షేత్రే [ద్వార దర్శనం] |
| | 8 | మం | ద్వా 54.38 కృ 14.2 కూర్మద్వాదశి |
| | 9 | బు | త్ర 58 17 రో 18.47. శేష ఉ 7.13 వ |
| | 10 | గు | చతు 60.10 మృ 23.57 రా 19.6. అనధ్యయన చతుష్టాయం |
| | 11 | శు | చతు 2.31 ఆ 29.36 త్యాజ్యాభావః హిమశోధన పూర్ణిమ |
| | 12 | శ | ○ పూ 7.18. పున 35.34 ది 2.35 త్యా 4.24 వ ఉ 7.36 మొ 9.22 వ |
| | 13 | ఆ | బ. పాడ్యమి. 12.17 పుష్య 41.30 ద్వితీయాతిథిః |
| | 14 | సో | విదియ 16.56 ఆశ్రే 47.13. ది 16.33. శూన్యతిథి ఉత్తరాయణ పుణ్యకాలం |
| | 15 | మం | త 21.17 మఘ 52.22 ది 19.48 తృతీయాతిథిః. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari